# యువ విజేతలు

## నిఖత్ బాను

నిఖత్ బాను ఆంధ్రప్రదేశ్‌కి చెందిన స్టార్ టేబుల్ టెన్నిస్ క్రీడాకారిణి. కేంద్రీయ విద్యాలయ స్కూల్‌కి చెందిన ఈ ఇంటర్మీడియట్ విద్యార్థిని తన పాఠశాల, ఉపాధ్యాయులు, స్నేహితులు తనకు అందిస్తున్న మద్దతుకు కృతజ్ఞతలు తెలుపుతోంది.

నిఖత్ ప్రతిరోజు అయిదారు గంటల టేబుల్ టెన్నిస్ ప్రాక్టీస్ చేస్తుంది. అయితే డబుల్స్ కంటే సింగిల్స్ పోటీలనే తాను ఆస్వాదిస్తానని చెప్పింది. ముఖ్యమైన టోర్నమెంట్‌కు ముందు తనకు తానుగా ఆటకు సంసిద్ధమవుతుంది కాబట్టే ఆమె సవాలును స్వీకరిస్తుంది. ''నేను ఆటలో మెళకువలు, టెక్నిక్‌లపైనే ఎక్కువగా దృష్టి పెట్టి అభ్యాసం చేస్తాను'' అంటుందామె. ఏకాగ్రతను, వేగాన్ని పెంచుకోడానికి ఆమె ధ్యానం, ఫిట్‌నెస్ వంటి కార్యక్రమాల్లో పాల్గొంటుంది కూడా

శరత్ కమల్, సైనా నెహ్వాల్‌లు ఆమెకు ఆదర్శం. ఎన్నటికీ చేతులెత్తివేయవద్దని, చివరి నిమిషంవరకు పోరాడాలని ఈ ఆట ఆమెకు నేర్పించింది.

నిఖత్ భవిష్యత్తులో ఒలింపిక్స్‌లో పాల్గొనాలని, అందులో పతకం గెలిచి యావత్ భారతదేశం గర్వించేలా చేయాలని కోరుకుంటోంది. ఈ నెల ఉదయతారకు చందమామ శుభాకాంక్షలు తెలియజేస్తూ, ఆమె స్వప్నాలు ఫలించాలని ఆకాంక్షిస్తోంది!



**ర్యాంకులు:**

- ఇండియన్ జూనియర్ ర్యాంకింగ్‌లో (2009) నాలుగవ స్థానం.

**సాధించిన అవార్డులు:**

- ఫ్రెంచ్ జూనియర్ కేడెట్ ఓపెన్ ఐటీటీ ఎఫ్ (2010) టోర్నీ టీమ్ ఈవెంట్‌లో కంచుపతకం.
- 71వ జూనియర్ అండ్ యూత్ నేషనల్స్ టీమ్ ఈవెంట్ సింగిల్స్‌లో రజిత పతకం, టీమ్ ఈవెంట్‌లో కంచు పతకం (2009).
- వరల్డ్ జూనియర్ సర్క్యూట్ ఓపెన్, ఇండోర్ (2009) టీమ్ ఈవెంట్‌లో కంచుపతకం.
- నేషనల్ స్కూల్ గేమ్స్, చండీగర్ (2008) అండర్- 17 విభాగంలో సింగిల్స్‌లో స్వర్ణపతకం.

# ఈ సంచికలో...

చందమామ సంపుటి: 64 ఫిబ్రవరి 2011 సంచిక: 02

















**Editor, CHANDAMAMA INDIA LTD.,**
B-3, Cross Road 'B', MIDC,
Andheri (East), Mumbai-400093.

ప్రియ మిత్రులారా!!!

కొత్త సంవత్సరంలో మనం శరవేగంగా అడుగులేస్తున్నాము. అప్పుడే ఫిబ్రవరి వచ్చేస్తోంది, అలాగే సంవత్సర పరీక్షలు కూడా.. రాబోయే రోజులు మరింత మంచిగా ఉంటాయనడంలో సందేహం లేదు. ఎందుకంటే వేసవి సెలవులు కూడా త్వరలోనే రానున్నాయి కదా?

చందమామలో మా ఉత్పత్తులను విస్తరించడానికి ప్రయత్నిస్తున్నాము. ఒక్క మాటలో చెప్పాలంటే ఈ ఏడాది మరిన్ని పుస్తకాలను ప్రచురించనున్నాము. అదీ కూడా డిజిటల్ కటెంట్ రూపంలో ఇవ్వబోతున్నాము. చందమామ పత్రికను ఆదరిస్తున్నట్లుగానే, ఈ కొత్త ఉత్పత్తులను కూడా మీరు ఆస్వాదించగలరని, అభినందించగలరని విశ్వసిస్తున్నాము. మీరు ప్రయాణంలో ఉన్నప్పుడు కూడా ఆస్వాదించగలిగే విధంగా మా పాఠకులకు మేం కథలకు టెక్నాలజీని మేళవించి అందించడానికి ప్రయత్నిస్తున్నాము.

ఫిబ్రవరి నెలలో డార్విన్, చత్రపతి శివాజిల జయంతి ఉత్సవాలు జరుగుతాయి. ఈ ఇద్దరూ దార్శనికులు, దిగ్గజాలు. ఒకరు జీవశాస్త్రంలో, మరొకరు అణచివేతకు వ్యతిరేకంగా పోరాడి తన జాతి ప్రజలకు విముక్తి ప్రసాదించడంలో అమోఘమైన కృషి చేశారు. డార్విన్ రాసిన ఉద్గ్రంథం 'జీవజాతుల మూలం' మన ఆలోచనా విధానాన్ని విప్లవీకరించింది. మరో వైపు శివాజి ధర్మ పరిపాలకుడు. అతడి సాహసం, వివేకం, న్యాయనిరతి, గెరిల్లా పోరాట పద్ధతులు 300 సంవత్సరాల తర్వాత కూడా ప్రజల నోళ్లలో నానుతున్నాయి.

ఫిబ్రవరి నెలలోనే కేంద్ర ఆర్థిక మంత్రి, పార్లమెంటులో బడ్జెట్‌ను ప్రవేశపెడతారు. బడ్జెట్ అంటే ప్రాథమికంగా ఒకరి ఆదాయాన్ని, ఖర్చును సమతుల్యపర్చే ప్రక్రియ. ఇది మన ఇంట్లో అమ్మ చేసే పనే కాని, అనేక సంక్లిష్టతలతో కూడి ఉండి పెద్ద స్థాయిలో జరిగే పని. మన తల్లితండ్రులు ఆదాయాన్ని, ఖర్చును ఎలా సమతుల్యం చేస్తారో అర్థం చేసుకోవడానికి మనం ప్రయత్నించాలి. ఎంత డబ్బును ఖర్చుపెట్టాలి, దేనిమీద ఖర్చు పెట్టాలి అనే అంశం మీద ఇది మనకు చక్కటి అవగాహన ఇస్తుంది. భవిష్యత్తులో కూడా ఇది మనకు సహకరిస్తుంది.

మా కొత్త పుస్తకాలను కూడా మీరు చదువుతారని, మీ విలువైన అభిప్రాయం పంపుతారని ఆశిస్తున్నాము. ఈలోగా ఈ నెల కథల నిధి మీకోసం సిద్ధమవుతోంది. – సంపాదకులు



ఫిబ్రవరి 2011 ₹.20/-
*Founded by* B. Nagi Reddi and Chakrapani

**Editor & Publisher :**
Prashant Sharad Mulekar
**Associate Editors :**
R. Vaasugi, K. Raja Sekhara Raju
**Sub Editor :**
Patricia Pandian
**Content Head - Online :**
Sowmya Bharadwaj
**Senior Artists:**
K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh, Sandeep Solkar
**Artist :**
Venki
**Layout Designers :**
B. Thirumal, K. Narendra, N. Sivakumar
**Production In-charge :**
Prashant Pawar
**Circulation:**
circulation@chandamama.com
**Head - Sales and Circulation:**
Sanjay B Thorat
**Manager - Sales & Circulation (West & North):**
Vinay K Brid
**Asst. Manager - Sales & Circulation (East):**
Subhankar Rej
**Sales Officer - Circulation:**
K. Ravishankar
**Advertisement :**
sales@chandamama.com
**Subscription:**
Subscription@chandamama.com
Ramya K (Chennai)
Ph: +91 44 4399 2828
**Head Office :**
**CHANDAMAMA INDIA LTD.,**
B-3, Cross Road 'B', MIDC,
Andheri (East), Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
Email:chandamama@chandamama.com
Website : www.chandamama.com

Published, Printed and Owned by CHANDAMAMA INDIA LTD., Published and Printed on their behalf by Prashant Sharad Muleker Published at B-3, Cross Road 'B', MIDC, Andheri (East) Mumbai - 400093. Printed At :- Shruti Art Pvt. Ltd. Unit No.1, Gupta Mills Estate, Devidayal Industrial Compound, Darukhana, Reay Road (East), Mumbai-400010. Editor :- Prashant Sharad Mulekar

T ఫిబ్రవరి 2011

# పాఠకుల లేఖలు



డిసెంబర్ చందమామలో నా బేతాళ కథ "ఓటమి భయం" ప్రచురించినందుకు చాలా సంతోషం. చందమామలో ప్రచురిస్తున్న పొట్టి కథలు చాలా బావున్నాయి. శ్రీనివాస కల్యాణం పూర్తి పుట బొమ్మ అద్భుతంగా ఉంది. పాత, కొత్త కథలు ఎక్కువగా ప్రచురిస్తున్నందుకు అభినంద నలు. చందమామను పాత సైజులోకి తీసుకురండి.

– ప్రతాప రవిశంకర్, గుంటూరు

పత్రికలతో పాటు వచ్చే యాడ్ బుక్ సైజులోకి మారిన చందమామను చూసి బాధేసింది. గత 15 సంవత్సరాలుగా ఎన్నడూ లేనన్ని కథలు డిసెంబర్ సంచికలో వేశారు. శ్రీనివాసకల్యాణం సీరియల్‌తో పాటు పది కొత్త కథలు ప్రచురించారు. కథలన్నీ తొలి 60 పేజీలలోనే వేసినందుకు మరీ సంతోషం. – కె. గౌరీశంకర్, హైదరాబాద్

డిసెంబర్‌నెల చందమామ అత్యంత మనోహరంగా ఉంది. గతంలో వయోజన విద్యా కార్యకర్తగా పనిచేసి అక్షరాస్యులను తీర్చిదిద్దాను. విద్య అనే కాంతి ప్రపంచ ప్రజలందరికీ మార్గదర్శనం చేస్తుంది. చక్కని కథనాలతో బాల విలేకరులు అలరిస్తున్నారు. అభినందనలు.

– దేసు రాజా వెంకటరత్నం, వేటపాలెం

అక్టోబర్, నవంబర్ ముఖచిత్రాలు చూస్తూనే హాయిగొలిపాయి. రూపాయి బిళ్ల, పులిస్వారీ, డబ్బు–ధర్మం, వేగానికి కారణం కథలు చక్కగా ఉన్నాయి. దీపావళి సందర్భంగా ప్రచురించిన గణపతి, హనుమ, మురళీ కృష్ణ, కుమారస్వామి చిత్రాలు చాలా బాగున్నాయి. శ్రీనివాస కల్యాణం సీరియల్ శుభంగా కొనసాగాలి. సంచిక చిన్న సైజులో ఉన్నప్పటికీ చక్కటి రమ్యమైన రంగుబొమ్మలు అలరించాయి.

– వాస్తు రామచంద్ర, నెల్లూరు

feedback@chandamama.com

**Visit us at : http://telugu.chandamama.com**

# నీతివంతుడు

ఒకానొక రాజు, వృద్ధుడైన మంత్రి చనిపోతే, ఆయన కుమారుడికి ఆ పదవి ఇచ్చాడు. కొత్త మంత్రి ఉద్యోగ బాధ్యత స్వీకరించిన రోజునే, రాజు కొక సమస్య ఎదురైంది. రాజ్యంలో శిస్తు వసూళ్లు చేసే ఉద్యోగి, ఆ డబ్బుతో పరాయి రాజ్యానికి పారిపోయాడు.

''ఈసారి మనం ఉద్యోగం ఇవ్వబోయేముందు, వచ్చిన వాడేపాటి నీతివంతుడో తెలుసుకోవాలి. కాని అదెలా సాధ్యం? మీ నాన్నగారైతే తగిన ఉపాయం ఆలోచించే వాడు,'' అన్నాడు రాజు, కొత్త మంత్రితో. ''ప్రభూ, చాటింపు వేయించండి. ఆ వచ్చిన వాళ్లలో నీతివంతుణ్ణి, మీకు చూపగలను,'' అన్నాడు మంత్రి.

చాటింపు విని పదిమంది వచ్చారు. మంత్రి వాళ్లను ఒక చీకటి గది గుండా రాజు దగ్గరకు రమ్మని చెప్పాడు. వాళ్లు అలాగే చేశారు. అప్పుడు మంత్రి వాళ్లతో, ''కారణం తర్వాత చెబుతాను. నా చుట్టూ వేగంగా పదిసార్లు ప్రదక్షిణం చేయండి.'' అన్నాడు.

ఒక్కడు తప్ప మిగతా తొమ్మిది మందీ అలా చేయడానికి నిరాకరించారు. మంత్రి వాణ్ణి, రాజుకు చూపి, ''ప్రభూ ఇతను నీతివంతుడు. ఉద్యోగంలో నియమించండి,'' అన్నాడు.

రాజు ఆశ్చర్యపోతూ చూశాడు. మంత్రి ఆయనతో, ''వీళ్లు నడిచి వచ్చిన చీకటి గదిలో రెండు చోట్ల మెరిసే వెండినాణేలు కుప్పగా పోయించాను. ఈ తొమ్మిది మంది వెండి నాణేలను తమ దుస్తుల్లో దాచుకున్నారు. వేగంగా కదిలేటప్పుడు వాటి శబ్దం వినబడి, తమ దొంగతనం బయటపడుతుందని, ప్రదక్షిణ చేయడానికి నిరాకరించారు, ''అని చెప్పాడు.

వాళ్లను పరీక్షించగా, మంత్రి చెప్పింది నిజమని రుజువయ్యింది. రాజు మంత్రి చూపిన నీతివంతుణ్ణి ఉద్యోగంలో నియమించాడు.

– రావులపాటి ప్రసాద్



Avail the loyalty bonus!

**Chandamama Subscribers will get flat 10% off on subscription renewals! (All Editions)**

**Chandamama!**

**Because stories make the world go round...**

**Choose your Chandamama!**
Go to www.chandamama.com & subscribe Now!!



**Chandamama is available in English and 12 regional languages. Junior Chandamama for children above 4 years is available only in English.**

I want to subscribe to / gift / renew subscription for the following editions of Chandamama:

☐ English ☐ Telugu ☐ Tamil ☐ Kannada ☐ Hindi
☐ Marathi ☐ Gujarati ☐ Oriya ☐ Bengali ☐ Sanskrit
☐ Santali ☐ Malayalam ☐ Assamese ☐ Junior (Only in English)

Name: ....................................................................................

Date of Birth: ................................ Sex :......................................

Address: ....................................................................................

....................................................................................

....................................................................................

.................................................... City: ....................................

State:........................................ Pin:............................................

Telephone:....................................................................................

Mobile:....................................................................................

Email:....................................................................................

Subscription Number (for renewals):..........................................

Gift Subscription to the following address:

....................................................................................

....................................................................................

....................................................................................

....................................................................................

Enclosed Cheque/DD* for Rupees..........................................

Cheque/DD No ....................................................................

favouring Chandamama India Ltd on........................................

.....................................................................bank.

* Your subscription will commence in 6 weeks.
Please mail the subscription form to:
**Chandamama India Limited,**
B-3, Cross Road 'B',MIDC, Andheri (East), Mumbai-400093.
Phone +91 22 28312872 / 28311849
Email: subscription@chandamama.com
You can also subscribe online at: www.chandamama.com

| Take Your Pick! | 1 YEAR | 2 YEARS | 3 YEARS | 4 YEARS | 5 YEARS |
|---|---|---|---|---|---|
| ENGLISH (Rs. 25/- per copy) | Rs. 300 | Rs. 540 | Rs. 765 | Rs. 960 | Rs. 1125 |
| You Save | | Rs. 60 | Rs. 135 | Rs. 240 | Rs. 375 |
| REGIONAL (Rs. 20/- per copy) | Rs. 240 | Rs. 430 | Rs. 610 | Rs. 770 | Rs. 900 |
| You Save | | Rs. 50 | Rs. 110 | Rs. 190 | Rs. 300 |
| JUNIOR (Rs. 15/- per copy) | Rs. 180 | Rs. 325 | Rs. 460 | Rs. 575 | Rs. 675 |
| You Save | | Rs. 35 | Rs. 80 | Rs. 145 | Rs. 225 |

** conditions apply

**Annual Subscription Overseas :** US $40 for English Chandamama, US $30 for Regional Languages, US $25 for Junior Chandamama (including shipping and handling charges) by air mail.

# మౌనం విలువ

మంగాపురం జమీందారుకు ఎక్కువగా మాట్లాడే అలవాటు ఉండేది. కోపిష్టి కావడం వల్ల, ఆ విషయం ఆయనకు తెలియ జెప్పడానికి ఎవరికీ ధైర్యం లేకపోయింది.

ఒకనాడు జమీందారు ఒంటరిగా వాహ్యాళికి వెళ్లాడు. ఊరి చివర ఒక అందమైన కొండ ఉన్నది. జమీందారుకు కొండమీదికి వెళ్లాలనిపించింది. కొండ దిగువన గొర్రెల కాపరి ఒకడు కనిపించాడు. వాణ్ణి తోడుగా రమ్మని జమీందారు కొండకేసి నడిచాడు.

గొర్రెల కాపరి మాట్లాడకుండా చకచకా కొండెక్కి పోసాగాడు. జమీందారు ఏవేవో మాట్లాడుతూ వెనకబడిపోయాడు. కొంత సేపటికి ఆయాసంతో ఒక బండమీద చతికిలబడ్డాడు. ''కొండెక్కాలంటే, మౌనంగా నడవడం చాలా ముఖ్యం. అప్పుడే అలసట లేకుండా త్వరగా కొండెక్కగలం,'' అన్నాడు గొర్రెల కాపరి అమాయకంగా.

కొండెక్కడానికే కాదు; జీవితంలో పైకి రావాలన్నా అతిగా మాట్లాడటం మంచిది కాదన్న విషయం జమీందారుకు అప్పుడు అర్థమయింది. ఆ తరవాత ఆయన మౌనం విలువ తెలుసుకుని అందరిచేతా మితభాషి అనిపించుకున్నాడు. – తాటిచెర్ల గురురామప్రసాద్



# అపాత్రదానం

సత్యానంద స్వామి శిష్యులతో దేశాటనం చేస్తూ ఉదయగిరి అనే ఊరుకి చేరుకున్నాడు. అక్కడ చెరువు గట్టున తాటాకు పందిళ్లు వేసి, వాటిలో అన్నదానం చేస్తున్నాడు రాజు. అలా ప్రతిరోజూ జరుగుతూ ఉంది. ఒకరోజు సత్యానంద స్వామి చెరువుగట్టున ఉన్న పందిరిలోకి వచ్చి, ''మీ రాజు మూర్ఖుడిలా ఉన్నాడు'' అన్నాడు.

ఆ విషయం రాజుకు తెలిసి ఆగ్రహించి సత్యానందస్వామిని సభకు పిలిపించి నిలదీశాడు.

''స్వామీ తమరు నన్ను మూర్ఖుడని అన్నమాట నిజమేనా?'' అన్నాడు.

''నిజమే మహారాజా'' అని ఒప్పుకున్నాడు సత్యానందుడు.

''అన్నదానం చెయ్యడం మూర్ఖత్వమా?'' అని అడిగాడు రాజు.

''అపాత్రదానం మూర్ఖత్వమే రాజా!''

''అపాత్రదానమా! చెరువు ఎండిపోయి, పంటలు పండక ప్రజలు ఆకలితో మాడుతుంటే వారికి పట్టెడన్నం పెట్టడం తప్పెలా ఔతుంది.'' అన్నాడు రాజు.

రాజా! ''ప్రజలకు చేపలు దానం చేయడం కాదు. చేపలు ఎలా పట్టుకోవాలో నేర్పాల'ని పెద్దలు చెప్పారు. చెరువు ఎండిపోవడానికి కారణం , అది మేటు వేసింది. వర్షాకాలంలో నీళ్లు నిలువకుండా పోతున్నాయి. అందువలన ప్రజలతో పూడిక తీయిస్తూ అన్నం పెడితే ప్రయోజనం ఉంటుంది. కనీసం వచ్చే సంవత్సరం కురిసే వర్షాలు చెరువులో నిలువ ఉంటే పంటలు పండుతాయి.'' అన్నాడు సత్యానంద స్వామి.

రాజుకి తన తప్పు తెలిసింది. మర్నాటి నుంచి ప్రజలతో చెరువు పూడిక తీయిస్తూ, వారికి భోజనాలు ఏర్పాటు చేశాడు.

– వాణిశ్రీ







# నిజమైన గురువు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు ''రాజా ఎవ రైనా ఒకమంచి ప్రయోజనాన్ని ఇంకొకరి ద్వారా సాధించాలని అనుకున్నప్పుడు, అది ఎవరి ద్వారా సాధ్యంకాగలదని అను కుంటున్నారో వారు అనుసరించే విధివిధా నాలను అర్థం చేసుకోవాల్సి ఉంటుంది. అటువంటి అవగాహనతో తాననుకున్నట్లుగా కుమారుణ్ణి మహా విద్వాంసుడిగా కూడా చూడగలిగిన సుదర్శన మహారాజు కథ లక్ష్య సాధనలో నువ్వు కనబరుస్తున్న దీక్షా, పట్టు దలా చూశాక చెప్పాలనిపిస్తున్నది. శ్రమ లేకుండా విను'' అన్నాడు.

పూర్వం సుమేరు దేశాన్ని సుదర్శన వర్మ అనే మహారాజు పరిపాలించేవాడు. ఆయన రాజధానికి సమీపంలో ఉన్న అరణ్యంలో గురువు జ్ఞానసూర్యుని గురుకులం ఉన్నది. అక్కడ విద్యాభ్యాసం చేసిన వాళ్ళందరూ



ఉద్దండ పండితులై దేశదేశాల్లో పేరు ప్రఖ్యా
తులు గడించారు. సుదర్శన వర్మకి తన
కుమారుడూ రాజ్యానికి ఉత్తరాధికారీ అయిన
కిశోర వర్మని మహా పండితుడిగా కూడా
చూడాలన్న ప్రగాఢమైన కోరిక ఉన్నది.

జ్ఞాన సూర్యుణ్ణి గురించి విన్న మహా
రాజు కుమారుణ్ణి ఆయన వద్దకు గురుకుల
వాసానికి పంపాలని నిశ్చయించుకున్నాడు.
ఈ సంగతి విని ఆస్థాన పండితుడు విద్యా
నాథుడు మహారాజుని కలిసి ''మన చిరం
జీవిని పండితుణ్ణి చేయటానికి నేను సరి
పోనా? ఎందుకిలా అతణ్ణి అరణ్యాలపాలు
చేశారు'' అని అడిగాడు.

సుదర్శనుడు నవ్వి ''మీరెలాగునూ
ఉన్నారు. జ్ఞానసూర్యుడి ప్రతిభ కూడా
యువరాజుకి కొంత అంటనివ్వండి'' అంటూ
కుమారుణ్ణి గురుకులంలో చేర్పించాడు.

కిశోరవర్మకు కొన్ని పరీక్షలు పెట్టిన తరువాత
తన శిష్యుడిగా స్వీకరించిన జ్ఞానసూర్యుడు
మహారాజుతో.. రాకుమారుణ్ణి పండితుణ్ణి
చేయటానికి ఇంత సమయం పడుతుం
దని నేను చెప్పలేను. వేచి చూడటానికి
తమకభ్యంతరం ఉండదనుకుంటాను''
అన్నాడు. దానికి సుదర్శనవర్మ అంగీకారమే
నన్నట్లు తలవూపి రాజధానికి తిరిగి వెళ్ళాడు.

ఒక ఏడాది గడిచాక సుదర్శన వర్మ ఆస్థాన
పండితుడు విద్యానాథుడిని వెంటబెట్టుకుని
కుమారుడి విద్యాభ్యాసం ఎలా సాగుతు
న్నదో చూడటానికి గురుకులానికి వెళ్ళాడు.
అతడికి అక్కడ కిశోరవర్మ సహాధ్యాయులు
ఏవో కొన్ని పుస్తకాలు ముందు వేసుకుని
వారికి వారే చదువుకుంటూ వారిలో వారే
చర్చించుకుంటుండటం కనిపించింది.
గురువు జ్ఞానసూర్యుడి జాడ ఎక్కడా లేదు.
సుదర్శన వర్మ రాజకుమారుణ్ణి దగ్గరకు
పిలిచి చదువు ఎలా సాగుతున్నదని అడగ్గా
అందుకు అతడు ''గురువుగారు ఎప్పుడూ
మాతో ఉండరు. ఆయన ఎక్కడికి వెళ్తారో,
ఎప్పుడు వస్తారో కూడా మాకు తెలియదు.
అయితే అప్పుడప్పుడు వచ్చి ఈ పుస్తకాలు
మా ముందుంచి చదువుతూ ఉండమని
చెప్పి వెళ్ళిపోతారు'' అన్నాడు.

ఇది విన్న విద్యానాథుడు మహారాజుతో
''ప్రభూ.. ఈ గురువుకి ఇతర వ్యాపకాలే
ఎక్కువ అనిపిస్తోంది'' అని వ్యంగ్యంగా
అనగానే మహారాజు ''ఈసారి ఆయన
ఉండగానే వద్దాం పదండి'' అంటూ రాజ
ధానికి వెళ్ళిపోయాడు.

మరో ఏడాది గడిచాక సుదర్శన వర్మ విద్యానాథుడితో కలిసి మరోసారి గురుకులానికి వచ్చి చూడగా పరిస్థితిలో ఏ మార్పూ లేకపోవటంతో నివ్వెరపోయాడు. కుమారుణ్ణి పిలిచి గురువుగారెక్కడ కనబడరేం అని అడగ్గా అందుకతడు ''వారు ఈమధ్యనే వచ్చి మరిన్ని పుస్తకాలు ఇచ్చి వెళ్ళారు. ముందిచ్చిన పుస్తకాలు చదవటం పూర్తి అయిందో లేదో అడిగి తెలుసుకున్నారు. ఆయన మాటలను బట్టి మరికొంతకాలం తరువాత వచ్చి మా తదుపరి కార్యక్రమం తెలుపగలరని అర్థమయింది'' అన్నాడు.

విద్యానాథుడు అవహేళనగా ''గురువు గారు పిల్లల్ని తమ చదువేదో తామే చదువు కొమ్మన్నట్లున్నది. ఎన్నాళ్ళకి యువరాజు పండితులవుతారు'' అన్నాడు. సుదర్శన వర్మ ఏమీ మాట్లాడకుండా రాజధానికి తిరిగివచ్చి, భటులిద్దరిని పిలిచి జ్ఞాన సూర్యుడి వివరాలు సేకరించి తెమ్మన్నాడు.

భటులు కొన్నాళ్ళకు తిరిగివచ్చి ''ప్రభూ! ఆ గురువు సాధారణంగా గురుకులంలో ఉండడు. ఆ గురుకుల నిర్వహణా బాధ్యత తను అతని భార్య, కుమారులు చూసుకుంటున్నారు. గురువు మాత్రం అరణ్యంలోని ఓ మారుమూల ప్రదేశంలో తాను నిర్మించుకున్న ఒక కుటీరంలో ఎప్పుడూ ఏదో గ్రంథ పఠనంలో నిమగ్నుడై ఉంటాడు. అప్పుడప్పుడు గురుకులానికి వచ్చి చూసి పోతుంటాడు'' అన్నారు.

సుదర్శన వర్మ మరి కొన్నేళ్ళు వేచి చూశాక గురుకులానికి వెళ్ళి చాటుగా అక్కడ జరుగుతున్నది గమనించసాగాడు. అతడివెంట విద్యానాథుడు కూడా ఉన్నాడు. అక్కడ అతనికి జ్ఞానసూర్యుడు శిష్యులందరినీ చుట్టూ





కూర్చోబెట్టుకుని, ఆసక్తికరమైన చర్చలూ, సంవాదాలూ చేస్తూ, మధ్యలో వారి సందే హాలు నివృత్తి చేస్తూ కనబడ్డాడు. వారిలో రాకుమారుడు కిశోరవర్మ కూడా ఉన్నాడు.

ఇది చూసి విద్యానాథుడు అసహనంతో, ''మహారాజా.. ఈ జ్ఞానసూర్యుడికి అతీత శక్తులేవో ఉన్నాయనిపిస్తున్నది. కాకపోతే శిష్యులకి పది నిమిషాలైనా పాఠాలు చెప్పక, తానే ఎక్కడో మారుమూలలకుపోయి, ఎవరి కంటా పడకుండా ఏదో చదువుకుంటూ రోజులతరబడీ పట్టించుకోకున్నా, ఇతడి శిష్యులకి ఈస్థాయి ఎలా వచ్చింది? అని'' ప్రశ్నించగా, సుదర్శన వర్మ విద్యానాథుణ్ణి. ''మీరనుకున్నట్లు జ్ఞానసూర్యుడికి ఎలాంటి అతీతశక్తులూ లేవు. ఈయనొక గొప్ప గురువు. అతని బోధనా పద్ధతులు అపూర్వం. ఎదు టపడి అభివాదం చేద్దాం రండి'' అన్నాడు.

సుదర్శనవర్మని చూడగానే జ్ఞానసూ ర్యుడు నమస్కరించి, ''మీరు గురుకులా నికి తరచూ-వచ్చి పోతున్నారని విన్నాను. కొత్త పుస్తకాలు చదివి కొత్త విషయాలు నేర్చుకోవాలన్న తపనతో క్షణం తీరికలేక తమను కలవలేకపోయాను. క్షమించండి. నా శిష్యుల విద్యాభ్యాసం అతి త్వరలో ప్రారంభం కానున్నది. అచిరకాలంలో రాజ కుమారుడు పండితుడై మీ వద్దకు తిరిగి వస్తాడు. సందేహపడకండి'' అన్నాడు.

ఈ మాటలకు విద్యానాథుడు వెక్కిరిం తగా ''ఇంకా ఆరంభం కాని దానికి ముగింపు అంత త్వరగా ఉంటుందా?'' అనగానే సుదర్శన వర్మ అతణ్ణి వారిస్తూ, ''జ్ఞాన సూర్యుడితో నాకేమీ సందేహం లేదు. మీర న్నది జరుగుతుందని పూర్తి విశ్వాసం ఉన్నది. సెలవిప్పించండి'' అంటూ విద్యానాథున్ని వెంటబెట్టుకుని రాజధానికి తిరిగివెళ్ళాడు.

కొద్దికాలానికి కిశోర వర్మ విద్యాభ్యాసం పూర్తి చేసుకుని తిరిగి వచ్చాడు. ఆ తరు వాత రాజ్యాధికారానికి వచ్చి గొప్ప పాలకుడై, పండితుడిగా కూడా పేరు తెచ్చుకున్నాడు.

ఈ కథ చెప్పిన శవంలోని బేతాళుడు ''రాజా! జ్ఞాన సూర్యుడు గొప్ప గురువనీ, అతని బోధనా పద్ధతులు అపూర్వమనీ, అతడికెలాంటి అతీత శక్తులూ లేవనీ మహా రాజు సుదర్శన వర్మ అంత ఖచ్చితంగా విద్యా నాథుడితో ఎలా చెప్పగలిగాడు? శిష్యుల్ని వదిలేసి, తానే మారుమూల అరణ్యంలోకి పోయి ఏకాంతంగా ఏదో చదువుకుంటూ ఉండటంలోని ఆంతర్యమేమిటి? అందు

వల్ల కలగబోయే ప్రయోజనం ఎవరికి? ఈ ప్రశ్నలకి సరైన సమాధానం తెలిసీ చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది'' అన్నాడు.

అందుకు విక్రమార్కుడు ''ఈ జ్ఞాన సూర్యుడు తనలాంటి గురువుల దగ్గర నుంచి తాము ఆశించినది పూర్తిగా పొందా లంటే, ఆ శిష్యులకి కూడా ఒక స్థాయి ఉండాలనీ, అవి కల్పించగల బాధ్యత గురు వుది మాత్రమేనన్న చిత్తశుద్ధి కలవాడు. అందుచేత అతడు తన శిష్యుల స్థాయి ఎలాంటిదో వారు విద్యార్థులుగా చేరటా నికి వచ్చినప్పుడే అంచనా వేస్తాడు.

పరిశీలించి చూస్తే, అతనివద్ద విద్యా భ్యాసానికని వచ్చినవారు బొత్తిగా అక్షరా భ్యాసానికి వచ్చినవాళ్ళు, ఆరంభ దశలో ఉన్నవాళ్ళు మాత్రం కాదని అర్థమవుతుంది. అందుకే అతడు ఆ శిష్యులకు తానందించ బోయే విద్యను స్వీకరించగల స్థాయి సమ కూర్చే ప్రయత్నాలు చేస్తాడు. ఈ సందర్భం లోనే వారికి మరిన్ని పుస్తకాలు తెచ్చి ఇచ్చి వారికి వారే చదువుకొని, చర్చించుకోవాలం టాడు. దూరం నుంచి పరికించి చూస్తూ..

ఆ శిష్యులకి తాననుకున్న స్థాయి వచ్చిం దనిపించగానే గురువుగా వారి ముందుకు వచ్చి విద్యాబోధన ఆరంభిస్తాడు. ఇది అతని బోధనా పద్ధతి అందుచేత అతడు అసలు విద్యాభ్యాసం ప్రారంభం కానున్నదని సుద ర్శనవర్మకి తెలియజేశాడు.

జ్ఞానం ప్రవాహం లాంటిదని, గురువు అన్నవాడు తన పరిజ్ఞానాన్ని, పాండిత్యాన్ని నిరంతరం మెరుగుపర్చుకోవాలన్న సదుద్దే శంతోనే, అతడు ఈలోగా ఏకాంతంగా కూర్చొని ఎన్నో కొత్త విషయాలు అధ్యయనం చేస్తాడు. గురువుకేకాక శిష్యులకు కూడా అందువల్ల ఎంతో ప్రయోజనమున్నది కదా! అంతా స్వయంగా చూశాక జ్ఞాన సూర్యుడు గొప్ప గురువు అన్న సంగతిని సుదర్శన వర్మకి పూర్తిగా అర్థమయింది'' అన్నాడు.

రాజుకి ఈ విధంగా మౌనభంగం కలగ గానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. – కల్పితం

[ఆధారం : జొన్నలగడ్డ రత్న]



# చందమామతో నా జ్ఞాపకాలు

పసితనంలో చందమామను చూస్తూ అమ్మ చేతి గోరుముద్దలు తిన్న రోజులు, చిన్నతనంలో చందమామ కథలు చదువుతూ హాయిగా గడిచిన అందమైన బాల్యాన్ని ఎవరైనా మరువగలరా? నాలుగో తరగతి వేసవి శెలవులకు, మా మావయ్యవాళ్ళ ఇంటికి వెళ్ళినప్పుడు, తొలిసారిగా చందమామలో వచ్చిన తోకచుక్క సీరియల్ బైండింగ్‌ను చూడడం జరిగింది. వాహ్.. ఏమని చెప్పను...! మా మావయ్యని అడిగితే, నిర్మొహమాటంగా 'ఇవ్వను' అని చెప్పి, వాళ్ళ పిల్లల కంట కూడా పడకుండా తన బీరువాలో జాగ్రత్తగా పెట్టి, ఆఫీసుకి వెళ్లిపోయాడు.

మావయ్య వద్ద ఉన్న, తోకచుక్క, కంచుకోట, ముగ్గురు మాంత్రికులు, జ్వాలాద్వీపం, మకరదేవత, పాతాళ దుర్గం, రామాయణం, మహాభారతం వంటి సీరియల్స్ నన్ను ఎంతగా ఆకర్షించాయో, మాటల్లో చెప్పలేను. మా అత్తయ్యను బతిమాలి, మా మావయ్య ఆఫీసుకి వెళ్ళిన వెంటనే, ఒక్కొక్క సీరియల్ తీసుకొని చదివి, సాయంకాలం లోపు అత్తయ్యకు తిరిగి ఇచ్చేసేవాణ్ణి. అలా చందమామ సీరియల్స్ అన్నీ చదివేశాను.



Name: K. Srinivas
Occupation: Software Engineer, Bangalore.

దాసరి సుబ్రమణ్యం గారు అద్భుతంగా రచించిన, జానపద సీరియల్స్‌ను చదువుతున్నంతసేపు, చిత్ర, శంకర్ గారి, బొమ్మలను మంత్రముగ్ధుడినై చూస్తూ, జానపద లోకంలో విహరించడం, చందమామతో నాకున్న ఒక అందమైన జ్ఞాపకం. తర్వాత మా ఊరి గ్రంథాలయంలో చందమామ కోసం పోటీలు పెరగడంతో అందరి కంటే ముందే లైబ్రరీకి వెళ్ళి దాన్ని చేజిక్కించుకుని ఆబగా చదివిన రోజులు నాకింకా గుర్తే. ఆ తరువాత, మా మావయ్యను ''మావయ్యా! ఇంత పెద్ద వాడివి అయ్యాక కూడ, ఇంకా చందమామని ఎందుకు చదువుతున్నావు?'' అని అడిగాను.

''చందమామలో అన్ని కథల నేపథ్యం, ఆధునికత కాకుండా పౌరాణిక, జానపద కాలమే. కల్మషం లేని మనుషులు, ఏ కథలోనైనా ధర్మానిదే గెలుపు, న్యాయానిదే విజయం. రమణీయమైన ప్రకృతి, ముచ్చట గొలుపే జలపాతాలు, సెలయేర్లు, సుందరమైన అడవులు, ఆధునిక పోకడలు లేని, అలనాటి అందమైన కాలపు వర్ణ చిత్రాలను చూస్తుంటే, మనసంతా ఆహ్లాదకరంగా ఉంటుంది. చందమామని చదువుతున్నంతసేపు, మళ్ళీ మన కళ్ళ ముందు, మన బాల్యం కదలాడదా,'' అని మా మావయ్య చెప్పాడు. నిజమే కదా ! అక్షర సత్యమనిపించింది.

చందమామ పత్రికతో మీ చిన్ననాటి అనుబంధం గురించి పాఠకులతో పంచుకుని, చందమామలో ప్రచురించాలనుకుంటున్నారా? దయచేసి మీ జ్ఞాపకాలు మాకు పంపండి. online@chandamama.com

(or)

Chandamama India Ltd; No:2 Ground Floor, Swathi Enclave,
Door No 5 & 6, Amman kovil street, Vadapalani, Chennai-600026.
Phone: 044-43992828



# నీతిపరులు

పూర్వం శ్రీరంగపట్నంలో ముత్యాలశెట్టి అనే రత్న వర్తకుడుండేవాడు. ఆయన గొప్ప ధనికుడు. సముద్ర వ్యాపారం కూడా చేసేవాడు.

ఒకనాడు ముత్యాలశెట్టి వద్దకు రామచంద్రుడు అనే ఆంధ్రదేశపు ధనికుడు వచ్చాడు. ముత్యాలశెట్టివద్ద ఉండే, మేలి రత్నాలన్నీ చూశాడు. వాటిలో ఒక రత్నం రామచంద్రుడికి బాగా నచ్చింది. దాని వెల ఎంత అని అడిగితే, ముత్యాలశెట్టి నాలుగు వేల వరహాలని చెప్పాడు.

రామచంద్రుడి వద్ద మూడువేల వరహాలే ఉన్నాయి. అయినా ఆ రత్నాన్ని వదలటానికి మనసు ఒప్పక ఆయన ముత్యాలశెట్టితో, ''ప్రస్తుతం నా దగ్గిర ఉండే మూడువేల వరహాలూ ఇస్తాను. రత్నం నాకివ్వండి. నేను ఇంటికి వెళ్ళి మిగతా, వెయ్యి వరహాలూ పంపుతాను'' అన్నాడు.

రామచంద్రుడు కులీనుడూ, నిజాయితీ గలవాడూ అన్న సంగతి కనిపెట్టి ముత్యాలశెట్టి, ''అలాగే మీ ఇష్ట ప్రకారమే చెయ్యండి. మీరు ఇవ్వవలసిన మొత్తం మీ పేర ఖాతా పుస్తకంలో గుర్తుగా పద్దువేసి ఉంచుతాను'' అన్నాడు.

రామచంద్రుడు పరమానందంతో రత్నాన్ని తీసుకుని స్వదేశానికి తిరిగివచ్చాడు. వచ్చిన కొద్ది రోజులకే ఆయనకు జబ్బుచేసి మంచానపడ్డాడు. ఆ వ్యాధి వైద్యానికి లొంగకపోవటంచేత ఆయన ఒక నెల మంచాన తీసుకుని చనిపోయాడు. చనిపోయేటప్పుడు ఆయన తన కొడుకైన పద్మనాభుణ్ణి పిలిచి, తాను శ్రీరంగపట్నంలో ముత్యాల



శెట్టి వద్ద కొన్న రత్నం సంగతి చెప్పి, దాని తాలూకు బాకీ తీరుస్తానని అతనిచేత ప్రమాణం చేయించుకున్నాడు.

రామచంద్రుడు బ్రతికినన్నాళ్లూ తన కున్నదంతా ఖర్చుచేసి భోగాలతో జీవితం వెళ్లబుచ్చినవాడు కావటంచేత ఆయన అనంతరం దమ్మిడీ కూడా మిగలలేదు. అందువల్ల పద్మనాభుడు ఎంత ప్రయత్నించినా తండ్రి చెప్పిన ముత్యాలశెట్టి బాకీ తీర్చలేక పోయాడు. వాడు చివరకు తన తండ్రి కొన్న రత్నాన్ని అమ్మి అయినా బాకీ చెల్లబెడదామనుకున్నాడు. కానీ అంత ఖరీదుగల రత్నాన్ని కొనే తాహతు గలవాళ్ళెవరూ చుట్టుపక్కల పద్మనాభుడికి కనిపించలేదు.

చివరకు పద్మనాభుడు ఆ రత్నాన్ని పట్టుకుని నేరుగా శ్రీరంగ పట్టణానికే బయలుదేరాడు. ఆ పట్టణంలో ఆ రత్నం అమ్ముడైతే సరేసరి, లేని పక్షంలో దాన్ని ముత్యాలశెట్టికి తిరిగి ఇచ్చేసి ఆయన ఇచ్చినంత సొమ్ము పుచ్చుకుందామని అతడి ఉద్దేశం.

కానీ దురదృష్టవశాత్తు పద్మనాభుడు శ్రీరంగ పట్టణం చేరే సమయానికి ఆ నగరాన్ని శత్రురాజులు ముట్టడించి కొల్లగొట్టుతున్నారు. నగరమంతా అరాచకంగా ఉన్నది. అటువంటి పరిస్థితిలో పద్మనాభుడు వచ్చినదారి పట్టినట్టయితే క్షేమంగా ఉండేది.

కానీ వాడు కార్యదీక్ష కొద్దీ నగరమంతా తిరిగి ముత్యాలశెట్టి ఇల్లు కనుక్కోవటానికి ఉపక్రమించాడు. ఆ విధంగా వాడు శత్రు సైనికుల వాతపడ్డాడు. వాళ్ళు పద్మనాభుణ్ణి పట్టుకుని, వాడివద్ద ఉండే ఖరీదయిన రత్నం కాస్తా కాజేసి, చావ చితకగొట్టి వదిలి పెట్టేశారు.

శ్రీరంగ పట్టణంమీద శత్రువులు వచ్చి పడిన సమయంలో ముత్యాలశెట్టి కొడుకు ఇంటినుంచి మైసూరుకు పారిపోయాడు. శత్రు సైనికులు ముత్యాలశెట్టి దగ్గిర ఉన్నదంతా ఊడ్చి పట్టుకుపోయారు. ముత్యాలశెట్టి విచారంతో మంచంపట్టి మనో వ్యాధితోనే ప్రాణాలు వదిలాడు. మైసూరు చేరిన ముత్యాలశెట్టి కొడుకు తన తండ్రి పేరు చెప్పుకుని అక్కడక్కడా అప్పులు చేసి,

చివరకు అప్పు కూడా పుట్టక తిండికి మాడి చనిపోయాడు.

ముత్యాలశెట్టి వంశానికి ఆయన మనమడు గోవిందశెట్టి మిగిలాడు. వాడు చాలా బుద్ధిమంతుడు. వాడికి తాతగారి ఆస్తి సంక్రమించకపోయినా తండ్రి చేసిన అప్పులు సంక్రమించాయి. వాడు కష్టపడి చదువుకుని, పెద్ద వర్తకులవద్ద గుమాస్తాగా ఉంటూ తన తాహతుకు తగినట్టు చిన్న చిన్న క్రయ విక్రయాలు చేస్తూ, తన సంపాదనలోనే సాధ్యమైనంత మిగుల్చుకుని, తండ్రి చేసిన అప్పులు ఒక్కొక్కటే తీరుస్తూ రాసాగాడు.



అక్కడ పద్మనాభుడు కూడా అట్టేకాలం బతకలేదు. ముత్యాలశెట్టి బాకీ తీరుస్తానని తండ్రి వద్ద ప్రమాణం చేశాడు. రత్నాన్ని నిష్కారణంగా పోగొట్టుకోవటమేగాక తీవ్రంగా దెబ్బలు తిన్నాడు. ఆదెబ్బలతోనే మంచంపట్టి మళ్ళీ కోలుకోలేదు. అతను చనిపోయే సమయంలో తన కొడుకైన చంద్రశేఖరుణ్ణి పిలిచి, ''నాయనా, శ్రీరంగ పట్టణంలో ఉండే ముత్యాలశెట్టికి మీ తాత వెయ్యి వరహాలు బాకీపడ్డాడు. ఆ బాకీ తీర్చటానికి నేను ప్రయత్నం చేసి నష్టపోయాను. ఆ బాకీ ఇప్పటికి మూడువేల వరహాలు అవుతోంది. అందుచేత నీవైనా కష్టపడి ధనం సంపాదించి, శ్రీరంగ పట్టణం వెళ్ళి, ముత్యాలశెట్టికి బాకీ తీర్చి వారి పద్దు పుస్తకంలో ఈ బాకీ పద్దు రద్దు చేయించు. నీవీ పనిచేస్తేగానీ నా ఆత్మా, నీ తాత ఆత్మా శాంతించవు'' అని చెప్పాడు.

చంద్రశేఖరుడు శ్రమపడి డబ్బు కూడబెట్టాడు. త్వరలోనే వాడు నాలుగువేల వరహాలు పోగు చేసుకుని, వాటితో శ్రీరంగ పట్నం వెళ్ళాడు. ముత్యాల శెట్టీ, ఆయన కొడుకూ పోయారనీ, వారి వారసుడు గోవిందశెట్టి ఉన్నాడనీ తెలిసింది. చంద్రశేఖరుడు గోవింద శెట్టి ఇంటికి వెళ్ళి, తన ఊరూ, పేరూ చెప్పుకుని, ''అయ్యా, మీ తాతగారినాటి పద్దు పుస్తకం తీయిస్తారా? అందులో ఒకబాకీతాలూకు పద్దుంటుంది'' అని అడిగాడు.

ఈ మాట వినగానే గోవిందశెట్టి గుండెల్లో రాయి పడింది. ఆ రోజే వాడు తన తండ్రి

చేసిన బాకీలను నిశ్శేషంగా తీర్చివేశాడు. తండ్రిగారి అప్పులు తీరాయిగదా అను కుంటే తాతగారి అప్పులు మీద పడే లాగుంది.

వాడు చంద్రశేఖరుడితో, ''అయ్యా, నేను మా తండ్రిగారు అప్పులు తీర్చేసరికి తల ప్రాణం తోకకు వచ్చింది. మా తాతగారి అప్పులు కూడా తీర్చమనటం ధర్మమా? వాటికి నేను బాధ్యుణ్ణి కాను. వాటికి ఏనాడో కాలదోషం పట్టి ఉంటుంది. క్షమించండి!'' అన్నాడు.

చంద్రశేఖరుడు చిరునవ్వు నవ్వి, ''మీ తాతగారు మాకేమీ బాకీ లేరు. ఏనాడో మా తాతగారే మీ తాతగారికి వెయ్యి వరహాలు బాకీ పడ్డారు.

మాట నమ్మకం మీద మీ తాతగారు అప్పుపెట్టారు. పరువైన వాడి మాటకు కాలదోషం ఏముంటుంది గనక? మా తాతగారి బాకీ వడ్డీతో సహా తీర్చటానికి సొమ్ము తెచ్చాను. దయచేసి పద్దు పుస్తకం వెతకండి'' అన్నాడు.

గోవిందశెట్టి చంద్రశేఖరుడి నీతిపర త్వానికి ఆశ్చర్యపడ్డాడు. అతను పాత కట్ట లన్నీ వెతకగా ఒక పద్దు పుస్తకంలో రామ చంద్రుడి పేర వెయ్యి వరహాలు ఖర్చు పద్దు ఉన్నది.

గోవిందశెట్టి చంద్రశేఖరుడితో, ''ఈ బాకీ సంగతి మీరు చెప్పేదాకా నాకు తెలీదు. అయితే ఒక్క విషయం నేను దీన్ని రొక్కంగా పుచ్చుకోను. మీవంటి నీతిపరులు ఎక్కడా నాకు దొరకరు. మీరు తెచ్చిన నాలుగు వేల వరహాలతో మనిద్దరమూ సమిష్టి వ్యాపారం చేద్దాం. మీకు అభ్యంతరం లేకపోతే చెప్పండి'' అన్నాడు.

చంద్రశేఖరుడు సరేనన్నాడు. ఇద్దరూ కలిసి వ్యాపారం చేసి, త్వరలోనే సంపన్నులై, ఎంతో స్నేహంగా ఉంటూ జీవితాలు వెళ్ళ బుచ్చారు.





# శ్రీనివాస కల్యాణం - 6

## శుభలేఖ

బృహస్పతి సూచనను అనుసరించి ఆకాశ రాజు శుకమహర్షిని తీసుకురావడానికి తన తమ్ముడైన తొండమానుడిని పంపించాడు. తొండమానుడు సమీపంలో ఉన్న శుక మహర్షి ఆశ్రమానికి వెళ్ళి ఆయనను సగౌరవంగా రథంమీద రాజధానికి తీసుకువచ్చాడు.

శ్రీనివాసుడు పద్మావతిని పెళ్లాడదలచుకున్న విషయాన్నీ, పద్మావతి ఇష్టపడిన విషయాన్నీ శుకమహర్షికి విన్నవించాడు ఆకాశరాజు. ''కొండకోనల్లో నివసిస్తున్న శ్రీనివాసుడి గురించి తనకు ఏమీ తెలియదనీ, పద్మావతిని అతడికి కన్యాదానం చేయవచ్చునా'' అనీ శుకమహర్షిని అడిగాడు.

''శ్రీనివాసుడు ఎవరో కాదు, అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకుడనైన శ్రీమహావిష్ణువే. ఆ పురుషోత్తముడికి నీ కుమార్తెను అర్పించి, జన్మను చరితార్థం చేసుకో ఆకాశ రాజా..'' అన్నాడు శుకమహర్షి.

శ్రీనివాసుడు శ్రీహరే అని విన్న ఆకాశ రాజు ఆశ్చర్యం వ్యక్తం చేశాడు. భూలోకంలో మానవులను ఉద్ధరించడానికి మహావిష్ణువు వేంకటాద్రి శిఖరాన్ని చేరుకున్నాడని వివరించాడు శుకమహర్షి.

''నీ కుమార్తెగా నువ్వు భావిస్తున్న పద్మావతి మహాలక్ష్మి అంశతో జన్మించిన పుణ్యవతి. గత జన్మలో ఆమె వేదవతి'' అన్నాడు బృహస్పతి ఆకాశరాజుతో.

''వేంకటాద్రి మీద శ్రీనివాసుడి ఆలనా పాలనా చూసుకుంటున్న వకుళమాత పూర్వజన్మలో కృష్ణుడిని ఒడిలో ఆడించిన యశోద'' అంటూ శుకమహర్షి వివరించాడు.

వక్కంతం సూర్యనారాయణ రావు



ఆకాశరాజు ఆనందంతో, ఆశ్చర్యంతో కళ్లు పెద్దవిగా చేసి బృహస్పతినీ, శుకమహర్షినీ కలియజూశాడు.

"అందరూ కారణ జన్ములే" అన్నాడు శుకమహర్షి. "నువు కూడా కారణజన్ముడివే ఆకాశరాజా. గతజన్మలో నువ్వు ఎవరో కూడా మాకు తెలుసు" అంటూ బృహస్పతి చిరునవ్వు నవ్వుతూ అన్నాడు.

ఆకాశరాజు కుతూహలంగా, వినయంగా చూశాడు. "గురుదేవా.. నా పూర్వజన్మ గురించి తెలుసుకోవాలన్న కోరిక కలుగుతోంది" అన్నాడు.

బృహస్పతి "వినిపిస్తాను... విను" అన్నాడు.

పూర్వం కాళహస్తిక్షేత్రంలో పురంధరుడనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతనికి లేకలేక ఒక కొడుకు కలిగాడు. అతనిపేరు మాధవుడు. సకల శాస్త్రాలు అభ్యసించి, యుక్తవయస్కుడయ్యాడు. చిత్రలేఖ అనే చక్కని కన్యను వివాహం చేసుకున్నాడు. కొంతకాలం అనంతరం శారీక వాంఛలకు దాసుడైపోయాడు. భార్య చేసిన హితోపదేశాన్ని పెడచెవినిపెట్టి, ధర్మం తప్పి ప్రవర్తించాడు. మద్యపానమూ, మాంసభక్షణమూ చేసి కులభ్రష్టుడైపోయాడు. తల్లిదండ్రులనూ, భార్యనూ వదిలి పెట్టి వెళ్లిపోయాడు. అనేక పాపాలు మూటగట్టుకున్నాడు.

ఏ స్త్రీ కోసం తన కులాన్నీ, ధర్మాన్నీ, నీతినీ త్యజించి పక్కకు వెళ్ళిపోయాడో ఆ స్త్రీ కాల క్రమాన చనిపోయింది. మాధవుడు దిక్కులేనివాడయ్యాడు. దేశద్రిమ్మరి అయిపోయాడు. ఉత్తరాదికి చెందిన రాజు పరివారంతో కలిసి, శేషాచలం యాత్రకు వెళ్తూ ఉంటే, చూసిన మాధవుడు వాళ్ళ వెంట వెళ్ళాడు. వాళ్ళు తినగా మిగిలిన ఎంగిలి మెతుకులు తింటూ వాళ్ళ వెన్నంటే వెళ్ళసాగేడు.

రాజు, పరివారము కపిలతీర్థ క్షేత్రములో తలనీలాలు తీయించుకున్నారు. వాళ్ళను అనుకరిస్తూ మాధవుడూ తన తల వెంట్రుకలు తీయించుకుని గుండు చేయించుకున్నాడు. రాజ బృందం చనిపోయిన పెద్దలకు పిండ ప్రదానం చేసి, శ్రాద్ధ కర్మలు ఆచరించారు. పిండ ప్రదానానికి అన్నమూ, ధాన్యమూ లేని కారణంగా మాధవుడు మట్టితో పిండాలు చేసి, మరణించిన తన పూర్వీకులకు శ్రాద్ధ కర్మలు చేశాడు.

యాత్ర చేస్తున్న రాజ బృందంతోబాటు శేషాచలాన్ని అధిరోహించాడు. పరమ పావనమైన శేషాచల పర్వతంమీద పాదం మోపగానే మాధవుడి పాపాలు కరిగిపోవడం ప్రారంభించాయి. మాధవుడి శరీరంలో నుంచి పుట్టిన అగ్ని అతడి పాపాలను దహిం చివేసింది. అతడు పర్వత శిఖరం చేరుకుని అక్కడ విశ్రమించాడు. బ్రహ్మదేవుడు అతని ముందు ప్రత్యక్షమయ్యాడు. ''మాధవా.. శేషాచల మహిమ నువ్వు చేసిన ఘోర పాపాలను దహించి వేసింది. పుష్కరిణిలో స్నానం చేసి వరాహ స్వామిని సేవించి నీ శరీరాన్ని వదిలిపెట్టు. భవిష్యత్తులో నారా యణపురం సుధర్ముడి కొడుకుగా నువ్వు జన్మిస్తావు. ఆ జన్మలో శ్రీమహాలక్ష్మి నీ కుమార్తెగా అవతరిస్తుంది. ఆమెను పెళ్ళాడి శ్రీమహావిష్ణువు నీకు అల్లుడౌతాడు అన్నాడు బ్రహ్మ. బ్రహ్మదేవుడు ఆజ్ఞాపించిన విధంగా మాధవుడు మరణించాడు'' అంటూ బృహస్పతి తన కథనం ముగించాడు.

''ఆకాశరాజా.. గత జన్మలో మాధవుడు మరెవరో కాదు, నువ్వే. నీ పాపాలను దహిం చిన కారణంతో శేషాద్రికి వేంకటాచలం అనే పేరు వచ్చింది సుమా'' అన్నాడు బృహస్పతి.

''నిజమా..'' అంటూ ఆశ్చర్యపోయాడు ఆకాశరాజు.

'వేం' అనే సంస్కృతాక్షరానికి 'పాపం' అని అర్థం. 'కటం' అనే పదానికి 'దహిం చివేసేది' అని అర్థం. 'వేంకటాచలం' అంటే 'పాపాలను దహించి వేసే పర్వతం' అని అర్థం. గత జన్మలో నీ పాపాలను దహించిన అనంతరం ఆ పర్వతం వేంకటాచలమనే పేరుతో ప్రసిద్ధి చెందిందని వివరించాడు శుక మహర్షి.



"గత జన్మలో మాధవుడు అయిన నీ గాథను శుకానందుడు జనక చక్రవర్తికి వినిపించాడు" అన్నాడు బృహస్పతి.

"శ్రీనివాసుడిని అల్లుడిగా చేసుకునే అంశంలో నా అనుమానాలన్నీ పటాపంచల య్యాయి. పద్మావతిని ఆ శ్రీనివాస ప్రభు వుకు కన్యాదానం చేస్తాను" అన్నాడు ఆకాశ రాజు ఆనందంగా.

"మంచిది. ఆ నిర్ణయాన్ని లేఖద్వారా శ్రీనివాసుడికి అందజేయి" అన్నాడు బృహస్పతి.

"ఆ లేఖను నేనే స్వయంగా ఆ శ్రీని వాసుడికి సమర్పించి, తరిస్తాను" అన్నాడు శుకమహర్షి.

తమ కూతురు పద్మావతిని ఇచ్చి వివాహం జరిపించడానికి నిశ్చయించినట్టు ఆకాశరాజు శ్రీనివాసుడికి శుభలేఖ రాసి శుక మహర్షికి ఇచ్చాడు. "మహానుభావా, శుభ లేఖను మా కాబోయే అల్లుడికి అందజేసి పుణ్యం కట్టుకోండి" అన్నాడు ఆకాశరాజు.

"ఆకాశరాజా.. వేంకటాద్రిమీద విడిది చేసిన వైకుంఠవాసుడికి శుభలేఖ అందజే యటం అనేది శుభప్రదమైన, విశిష్టమైన సేవ. ఆ సేవ చేసే అవకాశం లభించడం నా అదృష్టం" అన్నాడు శుకమహర్షి.

శుకమహర్షి వేంకటాద్రి చేరుకుని, శ్రీనివాసుడి నివాసానికి వెళ్ళాడు. పద్మావతితో ఆయన పరిణయం నిర్ణయించబడిన శుభ వర్తమానం చెప్పి, ఆకాశరాజు పంపిన లేఖను అందజేసాడు. ఆ లేఖను చదివిన శ్రీని వాసుడు సంతోషంతో పొంగిపోయాడు.



ఆమె రాయబారం సఫలమైనట్లు వకుళ మాతకు చెప్పాడు. శుక మహర్షికి అతిథి సత్కారాలు చేసి, ఆకాశరాజు పంపిన ఉత్త రానికి ప్రత్యుత్తరం వ్రాసి, శుకమహర్షికి అందించాడు. వివాహానికి శ్రీనివాసుడి సమ్మతిని ఆయన నోట చెప్పించుకుని విని, శుకమహర్షి ఆకాశరాజు పట్టణానికి తిరుగు ప్రయాణమయ్యాడు.

శుకుడు వెళ్ళిపోగానే శ్రీనివాసుడు వకుళమాతతో ఇలా అన్నాడు. "అమ్మా.. వధువు పద్మావతి వైపున తల్లిదండ్రులు ఉన్నారు. బంధువులున్నారు. మిత్రులు న్నారు. శ్రేయోభిలాషులు ఉన్నారు. పరి జనం ఉన్నారు. ఆకాశరాజు చేత పాలింప బడుతున్న ప్రజలు ఉన్నారు. నాకేమో తల్లి దండ్రులు లేరు. అన్నదమ్ములు లేరు.

అక్కచెల్లెళ్లు లేరు. పరిజనమూ లేరు. నాకున్నదల్లా నువ్వూ, శ్వేత వరాహుడు.. మీరిద్దరే. మనం ముగ్గురమూ పెళ్ళికి వెళితే ఏ మాత్రం వైభవంగా ఉంటుంది'' అన్నాడు.

నిరుత్సాహంగా పలికిన శ్రీనివాసుడి మాటలు విని వకుళమాలిక చిరునవ్వు నవ్వింది. ''ఎంత అమాయకుడివి నాయనా.. సకల యుగాలలోని జీవులందరికీ తల్లివీ, తండ్రివీ నువ్వే కదా. తల్లికాని తల్లి నేనున్నాను కదా. బంధువులు లేరన్న విచారం నీకెందుకు.. బ్రహ్మ నీ కుమారుడే కదా. పరమశివుడు చుట్టమే కదా. ఇంద్రుడు మొదలైన దిక్పాలకులూ, ఇతర దేవతలూ నీ పరివారమే కదా. దేవతలందరూ దిగివస్తే ఇక నీ కళ్యాణ వైభవానికి కొరత ఏముంటుంది చెప్పు'' అందామె.

'నేనిప్పుడు వైకుంఠ మందిరంలో లేను. ఇప్పుడు నేను పిలిస్తే వాళ్ళు వస్తారా..?'' శ్రీనివాసుడు సందేహిస్తూ అన్నాడు.

''దివిని వదిలి భువికి దిగివచ్చినంత మాత్రాన నీ ప్రభావం తగ్గుతుందా, తండ్రీ నువ్వు ఎక్కడ ఉంటే అక్కడే వైకుంఠం. సందేహించకుండా బ్రహ్మాది దేవతలందరికీ వర్తమానం అందజేసి, వివాహానికి ఆహ్వానించు'' వకుళమాలిక అంది.

''అందరినీ వివాహానికన్నా ముందుగానే ఇక్కడికి రమ్మని వర్తమానం పంపుతాను. వేంకటాద్రి మీదే కొన్ని రోజులు విడిదిచేసి, వివాహసన్నాహాలు పూర్తి చేసుకుని అనంతరం వధువు నగరానికి వెళ్దాం'' శ్రీనివాసుడు సాలోచనగా అన్నాడు.

''దేవతలకు వర్తమానం ఎవరి ద్వారా అందజేస్తావు శ్రీనివాసా..?'' వకుళమాలిక ప్రశ్నించింది.

''నా పర్యంకమైన ఆదిశేషుడూ, వాహనమైన గరుత్మంతుడూ ఉన్నారుగా, అమ్మా..'' శ్రీనివాసుడు చిరునవ్వుతో అన్నాడు.

కళ్లు అరమూసి, ఏదో సంకల్పించాడు శ్రీనివాసుడు. మరుక్షణం ఆదిశేషుడూ, గరుత్మంతుడూ ఆయన ముందు సాక్షాత్కరించారు. ఇద్దరూ తమ స్వామికి ప్రదక్షిణ నమస్కారాలు చేశారు.





# పంచతంత్ర కథలు

దమనకం చెప్పిన కుకుద్రుమం కథ విని పింగళకం, "సంజీవకం ద్రోహం తలపెట్టినట్టు నాకు రుజువెలా లభిస్తుంది?" అని అడిగింది.

"అతను కొమ్ములు ముందుకు చాచి ఏలినవారి వద్దకు వచ్చినట్లయితే పొడవటానికి వస్తున్నట్టు తమరు గ్రహించవచ్చు" అన్నది దమనకం.

అది సింహం వద్ద సెలవు పుచ్చుకుని, విచారంతో కుంగిపోతున్నట్టు నటిస్తూ సంజీవకం వద్దకు వెళ్ళింది.

"ఏం బాబూ? ఎందుకు విచారంగా ఉన్నావు?" అని సంజీవకం అడిగింది.

"రాజును ఆశ్రయించిన తరవాత విచారం కాక మరేమిటి? ఎల్లప్పుడూ తన ప్రాణం గురించీ, తన మిత్రుల ప్రాణం గురించీ రాజ సేవకుడికి భయమే గదా! పేదవాడూ, రోగీ, దేశ బహిష్కృతుడూ, మూఢుడూ, రాజ సేవకుడూ జీవచ్ఛవాలు. వారికి స్వేచ్ఛ లేదు. కుక్కలకైనా ఉన్నది గాని, వారికి లేదు. రాజ సేవకుడు యతి లాగా జీవించాలి. ఎందుకు? పాపపంకిలంలో పొర్లటానికి! మిత్రమా, నువ్వింకా ఈ సంగతి గ్రహించినట్టు లేవు" అన్నది దమనకం.

"రాజుకు సన్నిహితుడుగా ఉండటం చేత నాకు ప్రాణాపాయం ఉన్నదంటావా?" అని సంజీవకం అడిగింది.

"అదే నా అభిప్రాయం. మిత్రుడివి గనుక, ఏమైనా సరే, ఉన్నమాట అనేస్తాను. మన యజమాని పింగళకం ఎందుకో నీమీద అలిగాడు" సంజీవకాన్ని చంపి,

మిత్రభేదం-15

అందరికీ విందు చేస్తాను అని ఆయన ఇవాళ నాతో అన్నాడు. ఇది విని నేను కుంగిపోయానని వేరే చెప్పాలా? ఈ క్లిష్ట పరిస్థితిని ఎదుర్కొనటానికి నువు సిద్ధంగా ఉండాలి'' అన్నది దమనకం.

ఈ మాట విని సంజీవకానికి పిడుగు పడినట్టు అనిపించింది.

''అయ్యో, నాకీ దుర్గతి ఎలా దాపరించింది? రాజును విశ్వాసంతో సేవించినందుకు ఫలితం చావా? శత్రుత్వానికి కారణం తెలిస్తే చక్కబెట్టగలను, కానీ అకారణ వైరాన్ని ఎలా సరిచెయ్యటం? నేను పింగళకానికి ఏం ద్రోహం చేశాను?'' అన్నది సంజీవకం.

''మిత్రమా, రాజుల బుద్ధే అలాంటింది. మరీ బలవంతులని తోచిన వారిమీద దెబ్బతీస్తారు'' అన్నది దమనకం. ''నిజమే, నిజమే. తప్పు నాదే. ఆకులూ, అలములూ తినే నాబోటివాడు కేవల మాంసాహారి అయిన సింహంతో ఎన్నడూ స్నేహం చేసి ఉండరాదు. వెనకటికి హంసలాగా, సమానులు కానివారితో స్నేహం చేసిన వాళ్ళు నశించిపోతారు'' అంటూ సంజీవకం హంస కథ ఇలా చెప్పింది:

### హంస-గుడ్లగూబ కథ

ఒకానొక అరణ్యంలో ఒక సరస్సు ఉండేది. అందులో ఒక హంస ఒంటరిగా ఉంటూ, నీటిలో ఈదుతూ, ఆహారం తింటూ హాయిగా కాలక్షేపం చేసేది. ఒకనాడు ఆ ప్రాంతానికి ఒక గుడ్లగూబ వచ్చింది.

''నువు ఎక్కడి దానివి? ఇక్కడికి ఎందుకు వచ్చావు?'' అని హంస గుడ్ల



గూబను అడిగింది. దానికి గుడ్లగూబ, ''నేను ఇలాటి మరొక సరస్సు పక్కన ఉన్న తామరల తోపులో ఉంటాను. నీ స్నేహం చేసి పాపాలన్నీ పోగొట్టుకుందామని వచ్చాను'' అన్నది.

హంస ఈ మాటలకు ఉబ్బిపోయి, ''నీ ఇష్టం వచ్చినంత కాలం ఉండు'' అన్నది. గుడ్లగూబ అలాగే చేసింది.

రెండూ కలిసి చాలారోజులు సుఖంగా గడిపిన మీదట, గుడ్లగూబ తన చోటికి వెళ్ళిపోతూ, ''నీకు నాపై స్నేహ భావం ఉంటే, నా చోటికి వచ్చి, నా అతిథిగా ఉండాలి'' అన్నది.

హంస ఒక ఉదయం తామరల తోపుకు వెళ్ళింది. కానీ, గుడ్లగూబ ఒక కొండ గుహలో నిద్రపోతూ కనిపించింది.

''నీ మిత్రుడైన హంసను, నిన్ను చూడ వచ్చాను'' అన్నది హంస.

''నాకు పగలు కళ్ళు కనిపించవు. చీకటి పడినప్పుడు కలుసుకుందాం'' అన్నది గుడ్లగూబ. హంస చీకటి పడేదాకా వేచి ఉన్నది. అప్పుడు గుడ్లగూబ బయటికి వచ్చి, హంసను కుశలం అడిగింది. తర వాత హంస గుహ బయట నిద్రపోయింది.

ఒక బిడారు ఆ రాత్రి సరస్సు పక్కన మజిలీ చేసింది. తెల్లవారురఘామున బిడారు వాళ్ళు ప్రయాణ సన్నాహాలు ప్రారంభించి, శంఖం ఊదారు.

ఆ ధ్వని విని గుడ్లగూబ ఉలిక్కిపడి, గట్టిగా అరిచి, చప్పున గుహలోకి పోయింది. హంస మాత్రం గుహ వెలుపలనే ఉండి పోయింది.

ప్రయాణ సమయంలో గుడ్లగూబ అర వటం దుశ్శకునమని బిడారు నాయకుడు ధ్వనినిబట్టి గురిచూసి ఆ పాడు గుడ్ల గూబను కొట్టమన్నాడు. విలుకాడు అలాగే చేసేసరికి ఆ బాణం హంసకు తగిలి, అది కాస్తా చచ్చింది.





# వ్యాపారంలో కిటుకు

సులభుడు, సౌమ్యుడు అనే నిరుద్యోగ యువకులు ఏదైనా వ్యాపారం ప్రారంభించాలని విజయనగరం వచ్చారు. నగరంలో ఏ వ్యాపారం పెడితే లాభసాటో, ఎక్కడ పెడితే బాగుంటుందో తెలుసుకునేందుకు వేరువేరుగా పర్యటించి, రెండు రోజుల తరువాత ఒకచోట కలుసుకున్నారు.

''నగరం నడిబొడ్డున అయితే వ్యాపారం బాగా సాగుతుంది'' అన్నాడు సౌమ్యుడు.

''లాభమైనా, నష్టమైనా సరే ఇద్దరం భరించాల్సిందే!'' అన్నాడు సులభుడు.

''నాకాపద్ధతి ఎంతమాత్రం నచ్చలేదు. నేను వేరేగా వ్యాపారం పెట్టుకుంటాను'' అని నిర్మొహమాటంగా చెప్పేసాడు సౌమ్యుడు.

''పట్నంలో దుకాణం అంటే మాటలు కాదు. ఇద్దరం అయితే చేదోడువాదోడుగా ఉంటుంది'' అని ఎంతగానో నచ్చచెప్పాడు సులభుడు.

మిత్రుడి మాటలను ఏ మాత్రం ఖాతరు చేయని సౌమ్యుడు తను ఒంటరిగానే వ్యాపారం చేసుకుంటానని, సులభుడి దుకాణానికి ఎదురుగానే తన పలహార శాలను ప్రారంభించాడు.

రెండు కొత్త ఫలహారశాలలు వెలియడం చూసిన జనం ఆ మోజులో రెండింటికీ వెళ్ల సాగారు. ఆర్నెల్లు గడిచేసరికల్లా సౌమ్యుడి కంటే, సులభుడి వ్యాపారం పుంజుకోసాగింది. క్రమేపీ సౌమ్యుడి ఫలహారశాలకు జనం తగ్గసాగారు. అప్పటి నుండి భారీనష్టం వచ్చింది. చేతి మదుపురాని గడ్డు పరిస్థితి ఎదుర్కొన్నాడు. చిట్ట చివరికి ఏం చేయాలో తెలియక మరలా మిత్రుడు సులభుడిని కలిసి గోడు పెట్టుకున్నాడు సౌమ్యుడు.

''నీ మాటలను పెడచెవిన పెట్టి వ్యాపారం వేరుగా పెట్టాను... మనిద్దరం ఒకే వ్యాపారం చేసినా, అదీ నగరం నడిబొడ్డున పెట్టినా సరే,

కె.కె. రఘునందన

నేనెలాగ చితికిపోయానో నాకర్థం కావటం లేదు. జనం నీ కొట్టుకే వస్తున్నారు'' అని తన సందేహాన్ని వ్యక్తం చేసాడు సౌమ్యుడు. ఆ మాట విన్న సులభుడు నవ్వుతూ.. ''వ్యాపారస్తుడికి జనం నాడి పట్టుకోవటం తెలియాలి. కిటుకులు ప్రయోగించాలి. అప్పుడు తప్పని సరిగా పుంజుకుంటుంది'' అన్నాడు.

''మరి నేను చిట్కాలే ప్రయోగించాను. వచ్చే జనం నా దగ్గరకే మరల రావాలని చెప్పి వాళ్ళిచ్చే సొమ్ములో కొద్దిగా మినహాయించి, రేపెలాగూ ఫలహారానికి వస్తారు కదా అందులో చూసుకోవచ్చని చెప్పేవాడిని'' అని చిత్రంగా చూసాడు సౌమ్యుడు.

''అక్కడే నువు దెబ్బతిన్నావు. నీ చిట్కా నీకే ఎదురుతిరిగింది. ఎప్పుడైతే లెక్కల్లో ఖచ్చితత్వం లేకుండా పోయావో, అప్పుడే తమకి బాకీ ఉన్నవాడిగా జనంలో ముద్రపడ్డావు. పైగా నీకు సహనం లేదనీ, జనం అనుకోవటం నేను విన్నాను'' అన్నాడు సులభుడు.

''నా తప్పేమిటో నాకు తెలిసివచ్చింది. మరి నువ్వు నీ దుకాణాన్ని ఎలా అభివృద్ధిలోకి తీసుకువచ్చావు?'' అని ఆసక్తిగా అడిగాడు సౌమ్యుడు.

''మరేంలేదు. ఎప్పటికప్పుడు లెక్కలు తేల్చి అణా పైసలతో సహా ఎవరిది వారికి ఇచ్చేసేవాడిని. ఒకవేళ నాకు ఎవరైనా బాకీ ఉన్నా సరే ఈసారి నా దుకాణానికి వచ్చినప్పుడు చెల్లించండి ఫర్వాలేదు అని నవ్వుతూ చెప్పేవాడిని. మీలాంటి నిక్కచ్చి మనుషులు నాకొట్టుకి రావటమే గొప్ప అంటూ పొగిడేవాడిని. ఇదే జనం నాడి తెలుసుకోవటం అంటే!'' అన్నాడు సులభుడు.

సులభుడి వైఖరి తెలుసుకున్న సౌమ్యుడు తను మిత్రుడి మాటలు వినక, మొండిగా ప్రవర్తించి నష్టాలపాలైనందుకు సిగ్గుపడుతూ నగరం విడిచిపెట్టి తన గ్రామం పోతున్నట్టు చెప్పాడు. సౌమ్యుడి పరిస్థితిని గ్రహించిన సులభుడు అతడిని ఓదార్చి, ఇకనుండి తన వ్యాపారంలో భాగస్వామిగా ఉండమని కోరాడు. మిత్రుడి మంచి మనసుకి పొంగిపోయిన సౌమ్యుడు అందుకు అంగీకరించి, వ్యాపారంలో చేదోడువాదోడుగా నిలిచాడు.






# సొంత ఇల్లు

జోగినాథంకి సంసారంలో ఆర్థిక ఇబ్బందులు తలెత్తాయి. శివరాముడు అనే షావుకారు దగ్గరకు వెళ్లి ఏదైనా పని కోరాడు.

శివరాముడు స్వతహాగా మంచి వ్యక్తి. పనివారిపట్ల అతిమంచితనం ముప్పుకు దారి తీస్తుందన్న భావంతో వారు చేసే తప్పుల ఫలితంగా నష్టం వాటిల్లినప్పుడు చాలా కటువుగా వ్యవహరించేవాడు. ఆ సందర్భాల్లో ఒకరిద్దరు వేరొక చోట పనిలో చేరిపోతుండేవారు. వారు లేనప్పుడు వ్యాపారం చేయడం శివరాముడికి చేయి విరిగినట్లయ్యేది.

శివరాముడు ఇకమీదట పనిలో చేర్చుకునే వారికి కొన్ని షరతులు పెట్టి తలూపిన వారినే చేర్చుకోవాలని నిశ్చయించుకున్నాడు. పనికోసమై వెళ్లిన జోగినాథంతో షావుకారు వివరాలు అడిగి తెలుసుకొని, “నీకు పని ఇచ్చిన పక్షంలో దుకాణాన్ని నీ స్వంత ఇల్లులా చూసుకోవాలి! సమ్మతమేనా?” అన్నాడు.

జోగినాథం ఉత్సాహంగా తల ఊపడంతో పనిలోనికి చేర్చుకున్నాడు.

శివరాముడు జోగినాథం చేస్తున్న ప్రతీ పనిని ఓ కంట పెడుతూ పనివాడే అనుకుంటుండేవాడు. జోగినాథం చేరిన వెంటనే షావుకారు మన్ననలను పొందడం చాలా కాలం నుండి పనిచేస్తున్న గంగరాజు వీర్రాయుడికి కన్నుకుట్టినట్లయ్యింది.

ఒక దినం దుకాణం తుడిచి నీళ్లు తెచ్చిపెట్టే నీలాలు పనికి రాలేదు. జోగినాథం వెంటనే చీపురుతో దుకాణం శుభ్రపరిచి నుయ్యి దగ్గరనుండి కుండతో నీళ్లు తెచ్చి ఉంచాడు. వారం దినాల తరువాత దుకాణంలో ఎలుకలు, బొద్దింకల బెడద

ఆరుపల్లి గోవిందరాజులు

ఎక్కువైంది. అది గమనించిన జోగినాథం చెత్తా చెదారం తీసి పారవేశాడు. సామానుల న్నింటిని క్రమపద్ధతిలో సర్ది ఉంచాడు.

మరో దినం సామానులు కట్టడానికి చిత్తు కాగితాలు లేక బేరాలు ఆగిపోయినంత పనైంది. వెంటనే తెలిసిన వ్యక్తి వద్దకెళ్ళి చిత్తు కాగితాలు సంపాదించి బేరాలు నిలబెట్టాడు.

మరో పర్యాయం షావుకారు ఇంటినుండి ఒక గాజు జాడీ జోగినాథంకి ఇచ్చి, ''దీనిలో నూనెపోసి ఇంటిలో ఇచ్చిరా!'' అన్నాడు.

జోగినాథం జాడీని చూసి, ''ఇది చాలా మురికిగా ఉంది. శుభ్రపరిచి మీరు చెప్పి నట్లు చేస్తాను'' అని జాడీని బాగా శుభ్రం చేసి, అందులో నూనెపోసి ఇంటికి తీసుకొని వెళ్లాడు. తళతళలాడుతున్న జాడీని చూసి షావుకారు భార్య పార్వతి జోగినాథం పని తనానికి ఎంతో ముగ్ధురాలైంది.

గంగరాజు, వీర్నాయుడు షావుకారు లేని సమయం చూసి జోగినాథంతో ''మన షావుకారు సంగతి నీకు తెలియదు. తీపి మాటలతో, పొగడ్తలతో ఎటువంటిపనులైనా జరిపించేసుకుంటాడు. మనం ఎంతైనా పనివాళ్లం. ఈ దినం ఇక్కడ, రేపు వేరేచోట ఉండేవాళ్లం. కేవలం దుకాణం పనులు మాత్రమే చేస్తుండాలి. మెప్పుకోసం అన్నీ నెత్తిన వేసుకున్నా కలిసివచ్చేది ఏమీ ఉండదు. పైసా ఎక్కువ ఇచ్చే రకం కాదు'' అన్నారు.

జోగినాథం ఆ మాటలు విని నవ్వి ఊరు కొని తన పనిపాట్లలో మునిగాడు.

నెలదినాలు గిర్రున తిరిగాయి.

శివరాముడు యధాప్రకారం గంగరాజు, వీర్నాయుడికి నెలసరి జీతం చెల్లించి జోగినాథంతో.. ''ఇదుగో ఈ వెయ్యి రూపా యలు నీ నెలసరి జీతం. ఈ ఐదువందలు నువ్వు ఇచ్చిన మాట ప్రకారం దుకాణాన్ని నీ స్వంత ఇల్లులా భావించి అదనంగా కష్ట పడినందుకు'' అని అన్నాడు.

ఆ మాటలు వింటూనే దగ్గరలో ఉన్న గంగరాజు, వీర్నాయుడు ముఖం తేలేశారు.





# బంగారయ్య ఆస్తి

శిళ్ళంగేరి గ్రామంలో, బంగారయ్య అనే ఒక సామాన్య కుటుంబీకుడుండేవాడు. ఆయనకు తిరుమలయ్య, వెంకయ్య అనే ఇద్దరు కొడుకులు, మంగమ్మ అనే ఒక కూతురు. బంగారయ్య వాళ్ళందరికీ పెళ్ళిళ్ళు చేశాడు. ఆయన చనిపోయేనాటి వరకూ, అందరూ ఉమ్మడి కుటుంబంగా ఉండేవారు. మంగమ్మ అదే గ్రామంలో ఉండేది.

బంగారయ్య పోయాక, ఆయన కొడుకులు ఉన్నకొద్ది ఆస్తినీ పంచుకుని, వేరు, వేరు కాపరాలు పెట్టారు. బంగారయ్య భార్య తాయారమ్మ, ఇద్దరు కొడుకులవద్దా వంతులవారీగా ఉంటూ వచ్చింది.

ప్రారంభంలో తాయారమ్మను కోడళ్ళు గౌరవంగా చూసేవారు. కానీ, రాను రాను వాళ్ళు తాయారమ్మపట్ల కటువుగా ప్రవర్తించసాగారు. అందుకు ముఖ్య కారణం ఆమెవద్ద నగలుగానీ, డబ్బుగానీ లేకపోవటం. ఆమెకు జబ్బుచేస్తే, డబ్బు ఖర్చవుతుందని సరైన వైద్యం కూడా చేయించేవారు కాదు. కొడుకులు తమ భార్యలను అదుపులో పెట్టలేకపోయారు. మరి కొన్నాళ్ళు గడిచాక, వాళ్ళు తల్లిని పోషించటం బరువన్నట్లు ప్రవర్తించసాగారు.

తాయారమ్మ, కొడుకులవద్ద ఉండలేక, కూతురు మంగమ్మ ఇంటికి వెళ్ళి ఉండసాగింది. మంగమ్మ కొద్దిరోజులుపాటు తల్లిని ఆదరంగా చూసి, తర్వాత అవకాశం చిక్కినప్పుడల్లా, ''ఆస్తిని పంచుకోవడానికి కొడుకులు; పోషించడానికి కూతురు!'' అని ఎత్తిపోటు మాటలు అనసాగింది.

**25** ఏళ్లనాటి చందమామ కథ

తాయారమ్మకు, కూతురు మాటల్లో ఏదో కొంత న్యాయం ఉన్నట్టుగా తోచి, గ్రామపెద్ద వద్దకు వెళ్ళి, కొడుకులమీద ఫిర్యాదు చేసింది. గ్రామ పెద్ద అంటే అందరికీ గౌరవం. ఆయన చెప్పే తీర్పుల్లో న్యాయం ఉంటుందని అందరూ నమ్మే వారు.

తాయారమ్మను కొడుకులూ, కోడళ్ళూ సరిగా చూడకపోవడానికి కారణం ఏమిటో గ్రహించిన గ్రామ పెద్ద ఆమెతో, ''తాయా రమ్మా, నువ్వేమీ దిగులుపడకు. నీ భర్త చనిపోయేదానికినెల రోజుల ముందు, ఒక పెట్టెలో కొన్ని బంగారు నగలు దాచి, నావద్ద ఉంచాడు. అలా చేయడానికి కారణం ఏమిటో మాత్రం నాకు చెప్పలేదు. నేను నీ కొడుకులతో, కోడళ్ళతో, కూతురుతో మాట్లాడతాను. ప్రస్తుతానికి నా ఇంట్లోనే ఉండు'' అన్నాడు.

తర్వాత ఆయన వాళ్ళందరినీ పిలిపించి, ''మీరు, ఈ ముసలితనంలో తాయార మ్మను సరిగా ఆదరించకపోవడం, అన్యాయం అనిపించుకుంటుంది. కన్నతల్లిని పోషించ వలసిన బాధ్యత కొడుకులది. అయినా ఒకవేళ మీరు, మీ తల్లిని సరిగా చూడక పోతే, ఆమెకు సుఖంగా జీవించే ఆధారం లేకపోలేదు'' అన్నాడు.

గ్రామపెద్ద మాటలు అర్థంకాక తాయా రమ్మ కొడుకులు, ''అయ్యా, మీరు చెప్పేదేమిటో మాకు అంతుబట్టడం లేదు. కాస్త వివరంగా చెప్పండి'' అన్నారు.

''మరేంలేదు. బంగారయ్య చనిపోయే ముందు, బంగారు నగలున్న ఒక పెట్టెను



నాకు ఇచ్చి-- తనూ, తాయారమ్మా చని పోయాక, ఆ పెట్టెలో ఉన్న నగలను మీకూ, కుమార్తెకూ సరిసమానంగా పంచి ఇవ్వ మని చెప్పాడు. అంతేగాక, మీలో ఎవరైనా ఆమెను సరిగా చూడకపోతే, వాళ్ళకు నగలలో వాటా ఇవ్వవద్దన్నాడు. ఇప్పటి పరిస్థితి చూశాక, ఆ నగలను అమ్మి తాయా రమ్మ పోషణ కోసం ఆ డబ్బును ఖర్చు పెట్టాలనుకుంటున్నాను. మీరేమంటారు?'' అని అడిగాడు గ్రామపెద్ద.

తాయారమ్మ కొడుకులతోపాటు అందరూ, గ్రామ పెద్దకేసి ఆశ్చర్యంగా చూశారు. గ్రామపెద్ద ఇంట్లోకిపోయి, ఒక పెట్టెను తీసుకువచ్చి, దాని మూత తెరి చాడు. లోపల తళతళలాడుతూ చాలా నగలున్నాయి. వాటి ఖరీదు ఎంత లేదన్నా యాభైవేలుంటుందని, తాయారమ్మ బంధుగణమంతా అంచనా వేసుకున్నారు.

వాళ్ళు గ్రామపెద్దతో, ''అయ్యా, జరిగిం దేదో జరిగిపోయింది. ఆమెపట్ల తగిన ఆదరాభిమానాలు చూపలేదని మాకూ బాధగానే ఉన్నది. ఇంతవరకూ మావల్ల జరిగిన పొరబాట్లను క్షమించండి!'' అని తాయారమ్మను మా ఇంటికి రమ్మంటే, మా ఇంటికి రమ్మని బతిమలాడారు.

తాయారమ్మ ఒక్కొక్కరి ఇంట్లో నెల రోజులపాటు వంతులవారీగా ఉండడానికి అంగీకరించింది.

ఆనాటినుంచీ ఆమెను కోడళ్ళూ, కూతురూ ఎంతో ఆప్యాయంగా చూడసా గారు. ఆమెకు అవసరం అయిన అన్ని సదుపాయాలూ సమకూర్చారు.



ఆ తర్వాత కొంతకాలంపాటు తాయారమ్మ ఎలాంటి ఇబ్బందులూ లేకుండా సుఖంగా బతికి, ఒకనాడు చనిపోయింది. కర్మలన్నీ కొడుకులూ, అల్లుడూ ఘనంగా జరిపించారు.

ఆ తరవాత ఒకనాడు వాళ్ళందరూ గ్రామపెద్ద ఇంటికివెళ్ళి, తను దాచి ఉంచిన తాయారమ్మ నగలను పంచిపెట్టమని కోరారు. ఆయన సరేనని, వాటి వెల కట్ట డానికి, అందరికీ సమంగా పంచడానికీ, గ్రామంలోని శరభయ్య అనే నగలు చేసే అతణ్ణి పిలిపించాడు.

శరభయ్య వాటిని చూసి తెల్లబోయాడు. అవన్నీ బంగారువికాదు; నకిలీ బంగారు నగలు. ఇదివిని తాయారమ్మ కొడుకులూ, కోడళ్ళూ, కూతురూ నిర్ఘాంతపోయారు.

''ఎంతమోసం! అన్నీ నకిలీ నగలు దాచి, మమ్మల్ని మోసం చేశారు'' అన్నారు వాళ్ళు.

గ్రామపెద్ద చిన్నగా నవ్వి, ''మీరు మాత్రం ఏం చేశారు? కేవలం నగల ఆశతో తాయారమ్మ పైన నకిలీ ప్రేమ చూపించారు. నకిలీ ప్రేమకు, నకిలీ నగలు ప్రతిఫలం! ఏమంటారు?'' అని అడిగాడు.

దానికి ఎవరూ జవాబు చెప్పకుండా, తాయారమ్మపట్ల తామెంత నిర్దయగా ప్రవర్తించినదీ గుర్తుకు తెచ్చుకుని, అవమానంతో తలలు వంచుకున్నారు.

''ఏ విత్తనానికాచెట్టు, అన్న సామెత మీరు వినే ఉంటారు. మీ మనసుల్లాగే, ఈ నకిలీ నగలూ పైకి ఒక రకంగా, ఆంతర్యంలో మరొక రకంగా ఉండడం జరిగింది. ఇక వెళ్ళండి!'' అన్నాడు గ్రామపెద్ద.

జరిగిందేమంటే.. బంగారయ్య, గ్రామ పెద్ద వద్ద ఎలాంటి నగలూ ఉంచి పోలేదు. బంగారయ్య ఆత్మబంధువుల్లో మార్పు తెచ్చేందుకు, గ్రామ పెద్ద ఇలాంటి ఎత్తుగడ వేశాడు. – కోలార్ క్రిష్ణ అయ్యర్





# స్వయంవరం

మాళవదేశాన్ని పాలించే మాధవవర్మ వృద్ధుడైపోవడంతో, తన తదనంతరం రాజ్య పాలన ఎవరైనా పరాయివాడి హస్తగతం అవుతుందేమో అన్న బెంగ పట్టుకున్నది. ఆయనకు పుత్రులు లేరు; ఒకే ఒక కుమార్తె. ఆమె పేరు రత్నమాల.

రత్నమాల గొప్ప అందగత్తె. తెలివి తేటలు గలది. కాని, ఆమెకు రాజ్యాన్ని పాలించే శక్తి సామర్థ్యాలు కానీ, దక్షతగానీ లేవు.

మాధవవర్మ తనను పట్టిపీడిస్తున్న సమస్య గురించి మంత్రి సుగుణపాలుడికి చెప్పి, పరిష్కార మార్గం అడిగాడు.

అందుకు మంత్రి, మహారాజా, ''మీరీ విషయమై ఏ మాత్రం బెంగపడకండి. మన రాజ్యంలో అన్ని విద్యలతోపాటు క్షాత్ర విద్యల్లో కూడా ఆరితేరిన యువకులెందరో ఉన్నారు. యువరాణికి స్వయంవరం ప్రకటించి, అన్నిటా మిగిలిన యువకుల కన్నా మిన్న అని తేలిన యువకుడికి రత్నమాలనిచ్చి వివాహం జరిపించండి. అతడు రాజ్యాన్ని ఏ ఒడిదుడుకులు లేకుండా పరిపాలించగలడు'' అని సలహా ఇచ్చాడు.

రాజుకు ఈ సలహా నచ్చింది. రత్నమాల అంగీకారంతో ఆయన ఆ విధంగానే రాజ్య మంతటా చాటింపు వేయించాడు.

స్వయంవరానికి వచ్చిన యువకుల మధ్య శాస్త్ర, క్షాత్ర విద్యల్లో పోటీలు జరిగి నాయి. అందులో ప్రతి ఒక్కణ్ణి అన్ని విద్యల్లో జయవర్మ అనే యువకుడు ఓడించాడు.

పెంటకోట సామినాయుడు

మాధవవర్మ అతణ్ణి అభినందించి, ''నువ్వు నా కాబోయే అల్లుడివి. ఈ దేశానికి రాజువూ అని తేలిపోయింది. నా కుమార్తెను వివాహం ఆడి, రాజుగా పట్టాభిషిక్తుడవు కాబోయే ముందు, నువ్వు సాధించవలసిన మరొక ముఖ్య కార్యం ఉన్నది'' అన్నాడు.

''అదేమిటో చెప్పండి!'' అన్నాడు జయ వర్మ.

''రాజధానికి ఉత్తరంగా ఉన్న అరణ్య ప్రాంతంలో, ఉగ్రశీలుడనే బందిపోట్ల నాయకుడున్నాడు. వాడా ప్రాంతాల ఎంతో కాలంగా ప్రజలను దోచుకుంటూ ఇక్కట్ల పాలు చేస్తున్నాడు. వాణ్ణిపట్టి బంధించాలనే నా ప్రయత్నాలు ఫలించలేదు. మాళవ దేశానికి కాబోయే రాజుగా, ఇది నీకొక పరీక్ష వంటిది. ఏ విధంగానైనా సరే, ఆ ఉగ్ర శీలుణ్ణి నువ్వు లొంగదీయాలి. ఇందుకు అవసరమైన సైనికుల్ని వెంట తీసుకు వెళ్ళు'' అన్నాడు మాధవవర్మ.

జయవర్మ కొద్దిసేపు ఆలోచించి, ''మహా రాజా, ఈ పని సైనికులను వెంటబెట్టుకు పోయి సాధించగలిగింది కాదు. వాళ్ళను చూస్తూనే, ఆ బందిపోటు అరణ్యంలో మరొక ప్రాంతానికి పారిపోగలడు. నేను ఒంటరిగా వెళ్ళదలిచాను'' అన్నాడు.

ఆ తర్వాత జయవర్మ అరణ్యంలోకి ప్రవేశించి, ఉగ్రశీలుడి జాడల గురించి ఆ ప్రాంతాల ప్రజలను విచారించసాగాడు. త్వరలోనే బందిపోటు నాయకుడి అనుచరులు ఈ సంగతి పసిగట్టి, జయ వర్మను తమ నాయకుడి వద్దకు తీసుకు పోయారు.



జయవర్మ తానెవరైనది ఉగ్రశీలుడికి చెప్పి, 'నేను ఈ రాజ్యంలోని వీరులందరినీ ఓడించాను. రాజు తన కుమార్తెతో నా వివాహం జరిపించి, నాకు సింహాసనం అప్పగించబోతున్నాడు. నన్ను ద్వంద్వ యుద్ధంలో ఓడించగలిగితే.. రాజ్యం, రాకుమార్తె నీకు లభించగలవు'' అన్నాడు.

ఇది విన్న ఉగ్రశీలుడు మహదానందంతో కత్తిదూశాడు. అప్పుడు జరిగిన ద్వంద్వ యుద్ధంలో వాడు జయవర్మను అవలీలగా ఓడించాడు, వెంటనే అతడు రాజధానికి వెళ్ళి, రాజు మాధవవర్మను దర్శించి.. ''మహారాజా, మీరు రాకుమార్తె స్వయం వరానికి పెట్టిన పోటీలలో అందరినీ ఓడించిన జయవర్మను, నేను ద్వంద్వ యుద్ధంలో చిత్తు చేశాను. అన్నమాట ప్రకారం మీ కుమార్తెను ఇచ్చి వివాహం చేసి, రాజ్యాన్ని నాపరం చేయండి'' అన్నాడు.

ఈ వింత పరిణామానికి రాజు ఆశ్చర్య పోయాడు.

ఈలోగా జయవర్మ అక్కడికి వచ్చి, ''మహారాజా, ఈ ఉగ్రశీలుడు నన్ను ఓడించానంటున్నాడు. కానీ చూసిన వాళ్ళెవరూ లేరు! సభ ఏర్పాటుచేసి, మా ఇద్దరిమధ్యా పోటీ జరిపించండి,'' అన్నాడు.

ఈసారి జరిగిన కత్తి యుద్ధంలో జయ వర్మ, బందిపోటు నాయకుణ్ణి సునాయాసంగా ఓడించి, వాడి కంఠానికి కత్తిని గురిపెట్టి, ''ఒరే, మాళవదేశానికి కానున్న రాజుగా నిన్ను ఆజ్ఞాపిస్తున్నాను. తక్షణం నువ్వు, నీ అనుచరులతో ఈ రాజ్యం వదలి ఎక్కడికైనా వెళ్ళిపో!'' అన్నాడు.



ఉగ్రశీలుడు ప్రాణభయంతో గడగడా వణికిపోతూ, రెండు చేతులూ జోడించి, ''మీ ఆజ్ఞ శిరసావహిస్తాను. ఈరోజే నా అనుచరులతో రాజ్యం విడిచి మరొక దేశానికి పోతాను. నేనాడినమాట తప్పను మహారాజా.'' అంటూ అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

ఇది చూసి మాధవవర్మ ఎంతగానో సంతోషించి, రత్నమాలతో జయవర్మ వివాహం జరిపి, రాజ్యానికి అతణ్ణి పట్టాభిషక్తుణ్ణి చేశాడు.

తర్వాత ఒకనాడాయన జయవర్మతో జయా, ''నువ్వు బందిపోటు నాయకుణ్ణి వెతుకుతూ వెళ్ళినప్పుడు, నీకెలాంటి ఆపదా కలగకుండా చూడమని కొందరు వేగులను నీ వెనుకగా పంపించాను. అక్కడ ఉగ్రశీలుడి చేతిలో ఓడిపోయిన నువ్వు, సభికులు అందరి ఎదుటా క్షణాలమీద వాణ్ణి ఓడించావు, ఇదెలా సాధ్యమయింది?'' అన్నాడు.

ఇందుకు జయవర్మ చిరునవ్వు నవ్వి, ''న్యాయ నిర్ణేతలు లేకుండా జరిగే ఏ పోటీ అయినా ప్రయోజనం లేనిదే. అందువల్లనే. అరణ్యంలో బందిపోటు నాయకుణ్ణి ఓడించే ప్రయత్నం చేయలేదు. ఇది మొదటి కారణం'' అన్నాడు.

''మరి రెండవ కారణం?'' అని ప్రశ్నించాడు మాధవవర్మ.

''అరణ్యంలో వాణ్ణి నేను ఓడించి ఉంటే, వాడు మీ సమక్షానికి వచ్చేవాడు కాదు. రాజ్యంలో మరొక ప్రాంతానికి పోయి, ప్రజలను దోచుకుంటూ ఉండేవాడు. ఇలా ఆలోచించే.. వాడికి రాకుమారినీ, రాజ్యాన్నీ ఎరగా చూపించి, ఇక్కడికి వచ్చేలా చేశాను'' అన్నాడు జయవర్మ.

ఈ జవాబు విన్న మాధవవర్మ, తన అల్లుడు విద్యావంతుడూ, ధైర్యవంతుడేకాక, ఎంతో వివేకి కూడా అని గ్రహించి చాలా ఆనందపడ్డాడు.





# సాధువు వైద్యం

కోసలదేశపు మహారాణికి, ఒకసారి జబ్బు చేసింది. రాజవైద్యులు ఎన్ని మందులిచ్చినా ప్రయోజనం లేకపోయింది. మహారాజు గారి బంధుమిత్రులు, అన్ని వేళలా రాణి దగ్గిరే వుండి, ఆమెను ఓదార్చుతూండేవారు.

ఈ పరిస్థితుల్లో, హిమాలయ ప్రాంతాల నుంచి, ఒక సాధువు రాజధానికి వచ్చినట్టు మహారాజుకు తెలిసింది. ఆయన సాధువును ఆహ్వానించి ఆతిథ్యమిచ్చాడు. తర్వాత తన భార్య దీర్ఘవ్యాధిగ్రస్తురాలయిందని మహారాణి జబ్బు నయం కావడానికి తగిన మార్గం చూపవలసిందిగా రాజు సాధువును అభ్యర్థించాడు.

సాధువు, మహారాణిని పరీక్షించి రాజవైద్యులతో మాట్లాడాడు. వాళ్లు, రాణికి వాడిన మందులన్నీ పరీక్షించాడు. మందులలో ఏ లోపమూ లేదని గ్రహించాడు. తర్వాత కొంత ఆలోచించగా సాధువుకు, రాణి జబ్బు తిరుగుముఖం పట్టకపోవడానికి మూల కారణమేమిటో అర్థమైంది.

ఆయన మహారాజుతో, ''రాణికి స్వస్థత కలగకపోవడానికి కారణమేమిటో, నాకు బోధపడింది. ఆమెకు వచ్చిన వ్యాధి చాలా విచిత్రమైనది. పాపాత్ముల గాలి సోకుతూండటం వల్ల, ఆమెకు వ్యాధి తగ్గడం లేదు. అందువలన, అటువంటి వాళ్లు, ఆమె దగ్గిరకు వెళ్లకుండా ఉండేలా చూడండి. నేనిచ్చే మందుతో త్వరలోనే, ఆమె వ్యాధి తగ్గి కోలుకుంటుంది,'' అని చెప్పాడు.

సాధువు మాటలకు రాజు ఆశ్చర్యపోయాడు. రాణిని పరామర్శించిపోవడానికి వచ్చే వాళ్లలో, పాపాత్ములెవరో తెలుసుకోవడం ఎలా సాధ్యమవుతుంది?

తిరుమల శ్రీ

అయితే, సాధువు, రాజుతో చెప్పినది విన్న బంధుమిత్రులందరూ, అప్పటి నుండి రాణి దగ్గిరకు పోవడానికే భయ పడ్డారు. రాజు కూడా, ఈ పాపం గురించిన అపవాదు తన మీదికి వస్తుందేమో అన్న శంకతో, తరచు రాణి దగ్గిరకు వెళ్లడం మానుకున్నాడు.

సాధువు ఇచ్చిన మందులు సేవించిన రాణి, వారం రోజుల్లోనే వ్యాధి తగ్గి, లేచి తిరగసాగింది. రాజు సాధువుకు తన కృత జ్ఞతలు తెలుపుకుని, ''స్వామీ, నా అస్థా నంలో ఎందరో ఘనవైద్యులున్నారు. రాణికి వచ్చినది అతి విచిత్రమైన వ్యాధి అనీ, ఆమెకు పాపాత్ముల గాలి తగులగూడదనీ, వారు గ్రహించలేకపోయారు!'' అన్నాడు.

అందుకు సాధువు నవ్వి, ''మీ ఆస్థాన వైద్యుల తప్పేమీ లేదు. రాణి గారికి వారు ఇచ్చిన మందులే, నేనూ ఇచ్చాను. పాపా త్ముల గాలి సోకగూడదనడం మాత్రం, నేను చేసిన ప్రత్యేక చికిత్స!'' అన్నాడు.

రాజుకు, సాధువు మాటలు అర్థం కాక ఆయనకేసి ఆశ్చర్యంగా చూశాడు.

అప్పుడు సాధువు, ''మహారాజా, ఏ రోగికైనా మందులతో పాటు, విశ్రాంతి కూడా అవసరం. బంధుమిత్రులందరూ, రాణిగారి చుట్టూ చేరి, ఆమెకు విశ్రాంతి లేకుండా చేయడమే గాక, భయంకర వ్యాధికి గురి అయ్యానన్న అనుమానం కూడా ఆమెకు కలిగించారు. అందుకే నేను మర్మంగా, ఈ పాపాత్ముల గాలి సంగతి చెప్పడం జరిగింది. నిజానికి అలాంటిదేమీ లేదు,'' అన్నాడు.

''ఈ పాపాత్ముల గాలి సోకగూడదన్నది తమ కల్పన అన్నమాట,'' అన్నాడు రాజు.

''అవును, దానితో ఎవరికి వారు, రాణికే మైనా కీడు జరిగితే, అందుకు తామే కారణం అనుకుంటారని, ఆమె దాపులకు వెళ్లడం మానేశారు. ఆ విధంగా రాణిగారికి విశ్రాంతి దొరికి, నేనిచ్చిన మందులూ పని చేసినై. ఆమె అతి సామాన్యమైన వ్యాధికి గురి అయింది. అంతే!'' అన్నాడు సాధువు.





# శిథిలాలయం -11

(అరణ్యంలో ఎలుగుబంటును చంపిన తరువాత.. శిఖిముఖీ, నాగుమల్లులకు కనిపించిన వింత మనిషి, తన పేరు సవరభేరుండం అని చెప్పి, వాళ్ళిద్దర్నీ వెంటబెట్టుకుని పూజారి వద్దకు బయలుదేరాడు. వాళ్ళు కొండ ఎక్కుతుండగా, విక్రమకేసరి వాళ్ళకేసి పరిగెత్తుకు వస్తూ, తనకు పూజారి దాగివున్న కొండగుహ తెలిసిందని కేక వేశాడు. తరవాత--)

విక్రమకేసరి వేగంగా తమకేసి పరిగెత్తుకు రావటం చూస్తూనే, శిఖిముఖికి తాను శిథిలాలయ పూజారిని పట్టుకునేందుకు వేసిన పథకం దెబ్బతిని పోయిందని అర్థ మైంది. ఇప్పుడు విక్రమకేసరి పెట్టిన కేకలు ఆ దుర్మార్గుడు వినే ఉంటాడు; సందేహం లేదు. తననూ, నాగుమల్లినీ కల్లబొల్లి మాట లతో మోసపుచ్చి వెంట తీసుకుపోవచ్చని భావించిన పూజారికి, విక్రమ కేసరి రాకతో ఆ ఎత్తు పారదని తెలిసిపోయి ఉంటుంది. ఇప్పుడు చేయవలసిందేమిటి? పూజారి బంటయిన సవరభేరుండాన్ని బంధిస్తే, పూజారి అతడికి సాయపడేందుకు రావచ్చు. అప్పుడు...

శిఖిముఖి ఇలా ఆలోచించి విక్రమ కేసరికేసి చేయి ఊపుతూ, నాగుమల్లితో "మల్లీ..! అదుగో, ఆ భేరుండాన్ని మంచి మాటలతో పారిపోకుండా చూడు. నేను, కేసరితో ఒకమాట చెప్పి ఇప్పుడే వస్తాను" అన్నాడు.

నాగుమల్లి సరేనన్నట్టు తలవూపి, ముందుకు పోతున్న భేరుండంకేసి గబగబా పరిగెత్తింది. ఇంతలో కొండమీది నుంచి శిథిలాలయ పూజారి పెద్ద గొంతుతో,

దాసరి సుబ్రహ్మణ్యం

''భేరుండం! నువ్వు పరాకు చిత్తగిస్తున్న ట్టున్నది. జాగ్రత్త. ఇదుగో కర్మపాశం! దాన్ని పట్టుకుని వెంటనే ఆకాశంలోకి ఎగురు'' అన్నాడు.

శిఖిముఖి ఆ మాటలు వింటూనే, భేరుం డంకేసి తిరిగి అతణ్ణి పట్టుకునేందుకు పరిగెత్తేంతలో, కొండపై నుంచి నల్లని తాడొ కటి విసురుగా వచ్చి భేరుండం ముందు పడింది. భేరుండం దాన్ని గబగబా నడు ముకు చుట్టుకుని, ''పూజారిదేవా! ఈ సవరభేరుండం ఆకాశంలోకి ఎగిరిపోవటా నికి సిద్ధంగా ఉన్నాడు. ఏమిటీ, మీ ఆజ్ఞ?'' అని కేక పెట్టాడు.

మరుక్షణంలో భేరుండం తాడు సాయంతో గాలిలోకి లేచాడు. అతణ్ణి పట్టుకునేందుకు శిఖిముఖీ, నాగుమల్లి లతోపాటు విక్రమకేసరి కూడా పరిగెత్తాడు. కానీ, భేరుండం అప్పటికే గాలిలో అయి దారు నిలువుల ఎత్తుకు లేచిపోయాడు. విక్రమకేసరి పళ్ళు కొరుకుతూ, ''ఓరి, పూజారిబంటూ! నీకు చావు తప్పదు!'' అని విల్లంబు పైకెత్తి, బాణం వదలబో యాడు.

శిఖిముఖి చప్పున ఏదో ఆలోచన వచ్చిన వాడిలా తల ఎగరవేసి, విక్రమకేసరి చేయి పట్టుకుని అతడు బాణం వదలకుండా ఆపి, ''కేసరీ, తొందరపడకు, ఆ బంటును చంపినందువల్ల మనకు కలగబోయే మేలు కన్న కీడే అధికంగా ఉంటుంది'' అన్నాడు.



''వాడు దుష్టుడి సేవకుడు.. దుష్టుడు!'' అన్నాడు విక్రమకేసరి కోపంగా.

''వాడు దుష్టుడి సేవకుడేగానీ, దుష్టుడు మాత్రం కాదు. కేవలం అల్పజీవి, ఒట్టి బోళామనిషి. తాగినమైకంలో వాడు నిజంగా తాను ఆకాశంలోకి ఎగరగలను అనుకుం టున్నాడు. అలాంటి మందమతిని ఎవరైనా తమ స్వప్రయోజనానికి ఉపయోగించు కోవచ్చు. వాడు బతికి ఉండి, పూజారి సేవలోనే ఉంటే ముందు ముందు మనకు పనికివస్తాడు'' అన్నాడు శిఖముఖి.

''ముందు ఏనాటి సంగతో ఎందుకు? ఆ పూజారి ఉన్న గుహను ఒక కంట కనిపెట్టి ఉండేందుకు ఇద్దరు శబరుల్ని కావలి ఉంచాను. మరొకడు చెట్లమీదుగా ఎగిరి



పోతున్న ఎలుగుబంటి రహస్యం ఏమిటో కనుక్కునేందుకు వెళ్ళాడు. మనం పూజారి ఉన్న గుహను చుట్టుముడుదాం'' అన్నాడు విక్రమకేసరి.

''నీ కేకల్తో, గండభేరుండం తప్పించుకు పోవటంతో ఆ పూజారిగాడు మన ప్రయత్నం ఏమిటో గ్రహించే ఉంటాడు'' అని శిఖి ముఖి తానూ, నాగుమల్లీ అరణ్యంలో ప్రవేశించి ఎలుగ్గొడ్డును చంపినప్పటినుంచి జరిగిన సంఘటనలన్నీ చెప్పి, గండ భేరుండం తనకిచ్చిన జింక చర్మాన్ని అతడికి చూపించాడు. దానిమీద చిత్రించబడిన దృశ్యాలు చూసి విక్రమకేసరి సంభ్రమా శ్చర్యాల్లో మునిగిపోయాడు. ''ఈ చర్మం మీది చిత్రాలు మనకు బ్రహ్మపుత్రా లోయల్లో ప్రవేశించినప్పుడు మార్గాన్వేష ణలో సహాయపడతాయి. దాన్ని నీ దగ్గిరే ఉంచు'' అన్నాడు శిఖిముఖి.

విక్రమకేసరి ఆ జింక చర్మాన్ని ఎప్ప టిలా గుండ్రంగా చుట్టి, తాడుతో నడు ముకు బిగించుకున్నాడు. అంతలో శబరు డొకడు అక్కడికి పరిగెత్తుకుంటూ వచ్చి, ''కేసరి దొరా! ఆ మంత్రాల మారిగాడూ, మరొకడూ గుహలో చేరి ఏదో మాట్లాడు కుంటున్నారు. లోపలవాళ్ళు వెలుగు కోసం మంట చేసినట్టున్నది. గుహద్వారం పొగతో మూసుకుపోయింది'' అని చెప్పాడు.

''గుహలో మంట చేసింది వెలుగు కోసం కాదు, మన కళ్ళల్లో అంత పొగా, దుమ్మూ కొట్టి అక్కణ్ణించి పారిపోయేందుకు. నాకు వాడు దొరుకుతాడన్న నమ్మకం లేదు. అయినా ప్రయత్నం చేసి చూద్దామంటావా, కేసరీ?'' అన్నాడు శిఖిముఖి.

''దొరక్క మాయమైపోతాడా? వాడే మన్నా ఆకాశభూతమా?'' అన్నది నాగు మల్లి విసురుగా.

''నాగుమల్లి బాగా చెప్పింది, శిఖీ ఇక బయల్దేరుదాం;'' అంటూ విక్రమకేసరి ముందుండి దారితీశాడు. అతడు లోగడే పూజారి ఉన్న గుహ చూసినవాడు కావటం చేత, దారికోసం వెతుక్కోవలసిన అవసరం లేకుండా పోయింది.

కొద్దిసేపటి తరువాత వాళ్ళు గుహను సమీపించేసరికి, గుహా ముఖాన్ని దట్టంగా

పొగ కమ్మి ఉండటం వాళ్ళ కంటపడింది. ఆ పొగ చూస్తూనే శిఖిముఖి, ‘‘ఆ దుష్టుడు లోపల లేడు. అంత పొగలో ఏ ప్రాణి అట్టే కాలం బతకదు’’ అన్నాడు.

‘‘అయితే వాడు తప్పించుకు పోయిన ట్టేనా?’’ అన్నాడు విక్రమకేసరి నిరుత్సాహ పడిపోతూ.

శిఖిముఖి జవాబిచ్చేంతలో, వాళ్ళ వెంట వున్న శబరుడు ఒక ఎత్తయిన కొండరాతిమీద నిలబడి, ‘‘దొరా! పొగ యిక్కణ్ణుంచే కాదు, గుహవెనక మరి రెండు మూడు చోట్లనుంచి కూడా వస్తున్నది’’ అని పెద్ద కేకపెట్టాడు.

‘‘అంటే ఆ దుర్మార్గుడు పారిపోయేం దుకు గుహలో మరికొన్ని రహస్య మార్గాలు న్నవన్నమాట. కేసరి దొర కావిలి పెట్టిన ఇద్దరు శబరవాళ్ళూ ఏం చేస్తున్నారు? నిద్రపోతున్నారా లేకపోతే వాళ్ళను కూడా పూజారి భుజాన వేసుకుపోయాడా?’’ అన్నది నాగుమల్లి అవహేళన చేస్తున్నట్టు.

అది గుర్తించిన శిఖిముఖి వచ్చే కోపాన్ని ఆపుకుంటూ, ‘‘ఆ దెయ్యాలపోతు శబ రుల్నే కాదు, సవరవాళ్ళను కూడా గాడిదల్ని చేశాడు. ఇప్పుడు మనం కాస్త తెలివిగా ప్రవర్తించాలి. కేసరీ, నువ్వు కావలిపెట్టిన వాళ్ళిద్దరూ ఆ పూజారిని అనుసరించి పోయారని నా అనుమానం’’ అని అక్క డున్న చెట్టు కొమ్మ ఒకటి విరిచి గుహ ముందుకు వెళ్ళి, దానితో గుహ ద్వారం ముందు గట్టిగా విసిరాడు. గాలికి పొగ కాస్తా




చెల్లాచెదరైంది. అంతలో విక్రమకేసరి గుహ లోపలికి రెండు మూడు బాణాలు కొట్టాడు. లోపలి నుంచి ఎలాంటి శబ్దమూ రాలేదు.

ఇప్పుడేమి చేయటమా అని శిఖిముఖి ఆలోచించేంతలో, గుహమీది నుంచి నాగు మల్లి పెద్దగా చప్పట్లు చరిచి ఒక పెద్ద కేక పెట్టింది. ఆమెకు గుహ వెనక దిగువగా ఉన్న లోయకేసి పోతున్న పూజారీ, సవర భేరుండం కనిపించారు. వాళ్ళకు కొంచెం వెనక రాళ్ళచాటున నక్కుతూ ఇద్దరు వ్యక్తులు పోతున్నారు.

వాళ్ళు విక్రమకేసరి చెప్పే శబర కావలి వాళ్ళని ఆమె అనుకున్నది. ఆమె కేక పెట్టి పిలవగానే వాళ్ళల్లో ఒకడు వెనక్కు తిరిగి చూసి, రెండో వాడితో ఏమో చెప్పి గబగబా




కొండ ఎక్కి గుహకేసి రాసాగాడు. నాగుమల్లి తాను పూజారిని చూసిన సంగతి శిఖిముఖి వాళ్ళకు చెప్పబోయేంతలో, అతడూ, విక్రమకేసరీ, వెంట వున్న శబరుడూ గుహ మీదికి వచ్చి, దిగువనున్న లోయకేసి చూశారు. వారికి తమ దగ్గిర కొస్తున్న శబరుడితోపాటు, లోయలోకి దిగిపోతున్న శిథిలాలయ పూజారి కూడా కనిపించాడు.

''శిఖీ! మనం ఆ పూజారిగాణ్ణి వెంట తగిలి పట్టుకోవటం ఏమంత కష్టం కాదు'' అన్నాడు విక్రమకేసరి ఎంతో ఉత్సాహంగా.

''నాకూ అలాగే అనిపిస్తున్నది. మల్లి ఏమంటుందో?'' అంటూ శిఖిముఖి నాగు మల్లికేసి చూశాడు. ''వాడు అందకపోతే బాణంకొట్టి చంపుతాం. ఒకవేళ అంది కూడా తిరగబడితే ఈటెతో పొడిచి ప్రాణాలు తీస్తాం. ఊ.. పదండి'' అంటూ నాగుమల్లి గుహమీదినుంచి కిందికి దూకింది.

నాగుమల్లి ధైర్యసాహసాలు లోగడే రుజువు అయి ఉండకపోతే, శిఖిముఖీ, విక్రమకేసరి కూడా ఈ మాటల్ని కేవలం వాచాలతగానో, బడాయి చూపటంగానో జమకట్టి ఉండేవాళ్ళు. కానీ, వాళ్ళిద్దరికీ ఆమె శక్తిసామర్థ్యాలు తెలుసు. అయినా, ఆమె రక్షణ బాధ్యత తమమీద ఉన్నదని నమ్మి ఉన్న ఆ ఇద్దరూ కూడబలుక్కుని, నాగుమల్లికి ఇటూ, ఇటూ తాముండి, ఆమెకు ఎలాంటి ప్రమాదం జరక్కుండా చూడాలనుకున్నారు. శిథిలాలయ పూజారి ఏ క్షణంలో ఏ రకమైన దుష్ట పన్నాగం పన్నబోతాడో అన్నది ఎవరికీ అంతుచిక్కని సంగతి....

శిఖిముఖి ముందుండి దారితీస్తుండగా తతిమ్మా ముగ్గురూ అతణ్ణి అనుసరించి వేగంగా లోయలోకి దిగసాగారు. వాళ్ళ దృష్టి శిథిలాలయ పూజారి మీదనే ఉన్నది. వాడు తమ కన్నుగప్పి, ఏ రాళ్ళచాటునుంచో పారిపోకుండా చూడాలని వాళ్ళనుకున్నారు. కానీ పూజారి నిర్భయంగా, తాపీగా లోయ లోకి దిగిపోతున్నాడు. అతడు ఒకటి రెండు సార్లు తలతిప్పి శిఖిముఖీ వాళ్ళకేసి చూసి, భేరుండంతో చేతులూపుతూ ఏదో చెప్పాడు.

''ఆ దుష్టుడి ప్రవర్తన చూస్తుంటే నాకేదో అనుమానంగా ఉన్నది, కేసరీ. వాడు

మననుంచి పారిపోయేందుకు ఎలాంటి ప్రయత్నమూ చేయకపోగా, మనను ముక్కుకు తాడుపోసి లోయలోకి లాగుతున్నట్టు ప్రవర్తిస్తున్నాడు'' అన్నాడు శిఖిముఖి.

''లోయలో వాడి బ్రహ్మారాక్షసి సేన కాపలా ఉందేమో! ''అన్నది నాగుమల్లి వెటకారంగా. ''ఉంటే... సవరగండుపోతు కూతురు వాళ్ళను ఏకాకిగా ఎదుర్కొని జయిస్తుంది! మనకెలాంటి భయమూ లేదు కేసరీ'' అన్నాడు శిఖిముఖి.

ఆ మాటలకు విక్రమకేసరి పెద్దగా నవ్వాడు. అంతలో శబర కావలి వాళ్ళల్లో రెండవవాడు వాళ్ళ దగ్గరకు పరిగెత్తుకువచ్చి, పూజారి గుహలో ఉన్న మరొక దారిగుండా ఎలా బయటపడిందీ, తాను వాణ్ణి దృష్టి నుంచి తప్పుకు పోనీయకుండా లోయలోకి ఎలా వెన్నంటి పోయిందీ.... శిఖిముఖి వాళ్ళకు చెప్పాడు. ''నీ దగ్గిర వడిశెల ఉంది కదా? ఇప్పట్లో నీ ఈటెకన్నా దాని ఉపయోగం ఎక్కువలా కనబడుతున్నది. చేతికి అందకపోతే ఆ పూజారిగాణ్ణి ఒక్క వడిశెల దెబ్బతో-కిందపడగొట్టాలి'' అన్నాడు విక్రమకేసరి, ఆ శబరుడితో.

శబరుడు ఈటెను భుజాన పెట్టుకుని, వడిశెలలో రాయిపెట్టి దాన్ని ఇటూ, ఇటూ ఊపుతూ నడవసాగాడు. అంతలో పూజారి కొండ దిగి ఎదురుగా ఉన్న మైదాన ప్రదేశంలో ప్రవేశించాడు. శిఖిముఖి వెంట ఉన్న వాళ్ళను వేగంగా కదలండని హెచ్చరించి, పరిగెత్తుకుంటూ పోయి కొండ దిగి మైదానం చేరుతూనే, ''ఓహోయ్, దొంగ పూజారీ, ఆగు! పారిపోవాలని ప్రయత్నిస్తే చావు తప్పదు'' అని కేక పెట్టాడు.

శిథిలాలయ పూజారి వెనక్కు తిరిగి, ''అదుగో, ఆ అర్ధచంద్రాకారంగా కనబడే గండశిలలున్నవే, అక్కడికి పోయి ఆగుతాను. తాపీగా రండి,అంతా మాట్లాడుకుందాం'' అన్నాడు. (ఇంకా ఉంది)






# ఇంటింటికో పువ్వు

''ఆరోజు స్కూలుకి సెలవు పొద్దుటే బయటికి తండ్రి వెంటపడ్డాడు సిద్ధార్థ. నాన్నా.. నేనూ మీతో వస్తా!'' అంటూ. సిద్ధార్థ తల్లి మనోరమ వారికి చేతిసంచి అందిస్తూ, ''బజారులో కూరగాయలు కొనుక్కురండి'' అంది.

''అబ్బా ఈ గుడ్డ సంచీ ఎందుకమ్మా అసహ్యంగా... కూరలమ్మేవాళ్ల దగ్గర ప్లాస్టిక్ కవర్లుంటాయిగా'' అన్నాడు సిద్ధార్థ విసుగ్గా. ఏదో చెప్పబోయిన మనోరమ, భర్తశేషగిరి సైగ చేస్తే ఊరుకుంది.

ఆరోజు తండ్రితో తనకి కావలసినవన్నీ కొనిపించుకున్నాక కూరల మార్కెట్ దగ్గరికి వచ్చాడు సిద్ధార్థ. లోపలికి వెళ్ళబోతుండగా వారికి అక్కడ ఓ హృదయ విదారకమైన దృశ్యం కనిపించింది. అక్కడే ఉన్న చెత్తకుండీ పక్కనే పొట్టబాగా ఉబ్బిపోయి ఉన్న ఓ ఆవు నేల మీదపడి దొర్లుతూ నరకయాతన అనుభవిస్తోంది.

''నాన్నా! ఆవుకి ఏమయింది.. అలా దొర్లుతోంది?'' సిద్ధార్థ మనసు నీరయిపోతోంది ఆ ఆవును చూస్తుంటే...

''ఇదంతా మన మనుషులు చేసిన పాపమే సిద్ధూ!'' అన్నాడు నాన్న. ''మీరు చెప్పేది నాకు అర్థం కావటం లేదు నాన్నా!''

ఆయన నిట్టూర్చారు. ''పట్నాల్లో పశువులకు గడ్డి ఎక్కడ దొరుకుతుంది? అందుకే అవి మనం వాడి, నిర్లక్ష్యంగా పెంటమీద పారేసిన ప్లాస్టిక్ కవర్లు తింటున్నాయి.''

''ప్లాస్టిక్ కవర్లు తింటే ఇలా దొర్లుతాయా?''

''అవును. ఒక ఆవు కనీసం 20 కిలోల పదార్థాలను కడుపులో దాచుకోగలదు. ప్లాస్టిక్ వల్ల వాటి కడుపులో విష వాయువులు పుట్టి అవి కడుపునొప్పితో, భరించలేని బాధతో అల్లాడిపోతూ చచ్చిపోతాయి.''

తండ్రి మాటకి సిద్ధార్థకు దుఃఖం పొంగుకొచ్చింది. వాడికి ఆవులంటే చాలా ఇష్టం.

పి.వి శేషారత్నం



అమ్మమ్మగారి ఊరు వెళ్ళినప్పుడు కూడా ఎప్పుడూ పశువుల కొట్టాం దగ్గరే ఉండి ఆవు గంగడోలు నిమురుతాడు. పెయ్యతోబాటు తనూ పోటీగా గంతులేసి దానిని ఉరకలెత్తిస్తాడు. ఆవు తన తువ్వాయికి పాలు ఇస్తుంటే మైమరచిపోయి చూస్తుంటాడు. అమ్మమ్మ గట్టిగా పిలిస్తే తప్ప భోజనానికి కూడా లేవడు. అలాంటిది.. తనకెంతో ఇష్టమైన గోమాత... ఇలా నడిరోడ్డుమీద మరణయాతన పడుతోంటే ఎలా తట్టుకోగలడు?

''అంటే... ఆ ఆవు ఇప్పుడు చచ్చిపోతుందా నాన్నా?'' బేలగా అడిగాడు తండ్రిని.

''అంతే నాన్నా తప్పదు. ఇవాళ ఆవు... రేపు మనం... ఎవరికైనా జరిగేది అదే...''

''మనం కూడానా?'' హడలిపోయాడు సిద్ధార్థ.

''అవునురా. క్యారీ బ్యాగ్‌లలో వేసిన పదార్థాలు తింటూండబట్టే ప్లాస్టిక్‌లోని రసాయనాలు ఆహారంలో కలిసిపోయి మనుషుల ఆరోగ్యం కూడా క్రమేపీ పాడయిపోతోంది. ఈ కాలంలో అన్నీ అంతుపట్టని రోగాలే..''

''ఈ ప్లాస్టిక్ వల్ల అంత నష్టమా నాన్నా!''

''అవును సిద్ధూ! ఈ ప్లాస్టిక్ నీటిలో కరగదు. భూమిలో కలవదు... అవి వేసిన చోట మొక్కలు మొలకెత్తవు. భూసారం దెబ్బతింటుంది. పశువులతోబాటు మన దౌర్భాగ్యానికీ మనమే కారణమవుతున్నాం'' తండ్రి మాటలకు చలించిపోయాడు సిద్ధార్థ.

''నాన్నా! ఇవాళ మనం కూరలు కొనద్దు. వెనక్కి వెళ్లిపోదాం,'' సిద్ధూ కంఠంలో దృఢ నిశ్చయం. ''ఎందుకని సిద్ధూ?'' ఆశ్చర్యంగా అడిగాడు శేషగిరి.

''ఈరోజునుంచీ నేను ప్లాస్టిక్ వాడను నాన్నా! ఇప్పుడు మనం కూరలు కొన్నామంటే వాళ్లిచ్చిన ప్లాస్టిక్ సంచీల్లోనే వేసుకోవాలి. రేపు అమ్మకుట్టిన గుడ్డ సంచీ తెచ్చుకుని అందులో కూరలు తీసికెళ్దాం. రేపటినుంచీ నేను నా పుస్తకాల సంచీ మొదలుకుని లంచ్ బాక్సు వరకు సరే.. అన్నీ మామూలు సంచులే వాడతాను. నావల్ల ఏ మూగజీవికీ నష్టం కలగటం నేను భరించలేను. నేనేకాదు, ఇకమీదట నా స్నేహితులు కూడా ప్లాస్టిక్ వాడకుండా చూసే బాధ్యత నాదే నాన్నా!''

''ఇవాళ నాకెంతో సంతోషంగా ఉందిరా సిద్ధూ! ఇంటింటికో పువ్వు ఈశ్వరునికో మాల అయినట్టు నీలాంటి కుర్రాళ్లు నడుంబిగిస్తే మూగజీవులతోబాటు పర్యావరణాన్ని... మనల్ని మనం కాపాడుకోవటం చిటికెలో పని. నా స్కూటర్ డిక్కీలో ఇంకో జనపనార సంచీ ఉందిలే. పోయి తీసుకురా. కూరలు కొనుక్కునే వెళ్దాం'' అన్నారు శేషగిరి.



తిరిగి ఉపయోగించగల ఉత్పత్తులను ఎంచుకోండి.



మీరు కాగితం, ప్లాస్టిక్, వార్తాపత్రిక, గ్లాసని పునరుపయోగించవచ్చు.



మీ పాఠశాలలో పునరుపయోగ పథకాన్ని ప్రారంభించండి.



హీటర్లను మరియు ఎయిర్ కండిషనర్లను తక్కువగా ఉపయోగించండి.



సీఎఫ్ఎల్ బల్బులను ఉపయోగించండి.



తక్కువగా డ్రైవ్ చేయండి. నడవండి లేదా సైకిల్ తొక్కండి.



విద్యుత్తును ఆదా చేయండి.



ఒక మొక్కను నాటండి.



ఆదా చేసేలా ఇతరులను ప్రోత్సహించండి.



ప్లాస్టిక్‌ని విడిగా వేరుపర్చండి.



భూమి ఊపిరి పీల్చుకునేలా చేద్దాం. మనందరం కాలుష్యానికి భిన్నంగా జీవిద్దాం. భూతాపాన్ని తగ్గించడంపై మీ ఆలోచనలను మాకు పంపండి. online@chandamama.com (లేదా)

CHANDAMAMA INDIA LTD.,
No:2 Swathi Enclave, Door Nos. 5&6 Amman Koil street, Vadapalani, Chennai-600026.

# జగ్‌మగ్

ప్రియమైన బాలపాఠకులకు,

UNICEF, వివిధ పౌర సమాజాలు మరియు రాష్ట్రాల్లో పనిచేస్తున్న వివిధ ప్రభుత్వేతర సంస్థలు మద్దతు తెలుపుతున్న చైల్డ్ రిపోర్టర్స్ ఇనిషియేటివ్ ఆధ్వర్యంలో, భారతదేశంలోని పలు రాష్ట్రాల నుండి తమను కలవరపరుస్తున్న సమస్యలపై రాస్తున్న బాల విలేకరుల రచనలను మీరు ఆస్వాదిస్తున్నారని మేము ఆశిస్తున్నాము. 2010 నవంబర్ 14న బాలల దినోత్సవం సందర్భంగా UNICEF మధ్యప్రదేశ్ కార్యాలయం జగ్‌మగ్ అనే న్యూస్ లెటర్‌ని ప్రారంభించింది. ఈ పత్రికకు గుణా జిల్లాలోని మూడు గ్రామాలకు చెందిన పిల్లలు పూర్తిగా సంపాదకత్వ బాధ్యతలు నిర్వహిస్తున్నారు.

బాల విలేకరులుగా శిక్షణ పొందిన ఈ మూడు గ్రామాలకు చెందిన స్కూలు పిల్లలు, బోపాల్‌లో కొద్దికాలం విడిది చేశారు, విభావరి (గుణ), ఆరంభ్ (భోపాల్) ఎన్జీవో సంస్థలకు సంబందించిన ప్రతినిధులు కూడా ఈ పత్రిక ప్రారంభోత్సవంలో పాల్గొన్నారు.

మధ్యప్రదేశ్‌లోని UNICEF క్షేత్ర కార్యాలయం ఛీఫ్ డాక్టర్ టానియా గోల్డ్‌నర్ మాట్లాడుతూ, ''కమ్యూనిటీకి చెందిన నిర్ణయాలను తీసుకునేటప్పుడు పిల్లలు చెప్పేది విని, వారి అభిప్రాయాలు, దృక్పథాలను పరిగణనలోనికి తీసుకునేలా చేయవలసిన బాధ్యత వయోజనులు, వృత్తిజీవితం గడుపుతున్నవారు, నిర్ణయాధికారులుగా మనపై ఉందని'' తెలిపారు.

జగ్‌మగ్‌లో ప్రచురించబడిన ఈ కథనాలు మీకు నచ్చుతాయని భావిస్తున్నాము.

అభినందనలతో,
మీ దీదీ



# కవిత
# నీటి కథ



మీరు నీరు ఎక్కడినుంచి తెచ్చుకుంటున్నారు?
నీటిని ఎవరు తెస్తున్నారు?



కళ్లు తెరవండి, తాగడానికి ముందు నీటిలో మట్టి, చెత్త ఉందేమో తనిఖీ చేయండి
ఈ నీటిలో ప్రమాదం ఎక్కడ పొంచి ఉంది?



కుండపై మూత లేకపోవడాన్ని చూడండి
ఎవ్వరూ దాన్ని శుభ్రపర్చినట్లు, తోమినట్లు లేదు.



పిల్లలూ! చుట్టూ చూడండి
మీరు నీరు ఎక్కడినుంచి తీసుకువచ్చారు?



నేను ఒక ఊరి బావిని. నా చుట్టూ కట్టడం ఉంది.
అన్ని రకాల చెత్త నాలోకి వస్తోంది
నేను ఒక తెరిచి ఉన్న బావిని, నా తప్పేమిటి?





నేను పొడవైన, లోతైన చేతిపంపుని.
మంచినీటిని తీసుకురండి, చేతిపంపు చుట్టూ శుభ్రం చేయండి
దాంట్లో మన ఆరోగ్యం దాగి ఉంది.



నీటి కుండ చక్కగా, పరిశుభ్రంగా ఉండాలి
దాన్ని ఎత్తైన స్థలంలో ఉంచాలి.
కుండపైన చేత్తో పట్టుకునే జగ్గు ఉండాలి
కుండలోకి ఎవరూ తమ చేతులను దోపకూడదు.

# జగ్‌మగ్
## వార్తలలో పూర్తి ప్రచారం

ఇంజహోరా: కొన్నాళ్ల క్రితం మేం చిన్నపిల్లలమంతా కలిసి మధ్యప్రదేశ్ గుణా జిల్లాలోని ఒక వర్క్‌షాప్‌లో కలిశాము. తరుణ్ బోస్, జగదీష్ యాదవ్ (ఢిల్లీకి చెందిన టీచర్), అనిల్ గులాటి సర్ ఈ వర్క్‌షాపుకు హాజరయ్యారు. కొన్నాళ్ళ తర్వాత అనామిక మేడమ్ కూడా వచ్చి తనగురించి పరిచయం చేసుకున్నారు. తర్వాత, వార్తాపత్రికను ఎలా నడపాలో వివరించారు. మొట్టమొదట శీర్షిక ఉండాలి, తర్వాత ముఖ్యమైన పాఠం వివరాలతో కూడి ఉండాలి, చివరలో వ్యాసానికి సొగసులద్దే సమాచారంతో ముగించాలి. ఉదాహరణకు, సారా హోటల్ సమీపంలో ఒక షోరూమ్ ఉంది. *దాని చుట్టూ పచ్చటి చెట్లు ఉన్నాయి. దాని సమీపంలో ఎ.బి రోడ్‌వైపు దారితీసే పొడవాటి మార్గం ఉంది. ఎ.బి రోడ్‌పై నడుస్తున్న టెంపోలు, బస్సులు, ట్రక్కులను మీరు చూడవచ్చు.*

వారు మాకు తలొక దినపత్రికను ఇచ్చి దానిలోని కథనాలను జాగ్రత్తగా చదవమని చెప్పారు. మేము వార్తాపత్రికను చదివి అర్థం చేసుకున్నాము. భోజనం ముగించుకున్న తర్వాత మళ్లీ వర్క్‌షాపుకు వచ్చాము. సర్ మమ్మల్ని ఊరి సమాచారం రాయమని చెప్పి దాన్ని సవరించడానికి సునీల్ సర్‌కి కాగితాలు ఇవ్వమని సూచించారు.

వ్యవసాయం, నీటి ఎద్దడి, అంగన్‌వాడి మరియు పరిశుభ్రత వంటి ఊరికి సంబంధించిన మొత్తం సమాచారాన్ని సేకరించమని వారు మాకు చెప్పారు.

మరుసటి దినం సుదీప్, మనిష్ జీ కూడా వచ్చారు. వార్తా పత్రిక ప్రచురించబడే మొత్తం ప్రక్రియను సుదీప్ జీ మాకు చెప్పారు. చివరలో మేం బెలూన్లు పేల్చి సరదాగా గడిపాము. మేం ఆటలు కూడా ఆడి ఆస్వాదించాము. తర్వాత మేం మా ఇళ్లకు బయలుదేరాము.

గుణా నగరానికి నాలుగు కిలోమీటర్ల దూరంలో ఉన్న సారా హోటల్ సుందరమైనది, జనాకర్షకమైన స్థలం.

– శివరాం బఘేల్

*8వ తరగతి, ఇంజారా గ్రామం, గునా*



# బాలికలకు కూడా విద్యాహక్కు

బాలికలకు విద్య చాలా ముఖ్యమైనది. ప్రజలందరూ తమ కూతుళ్లకు చదువు చెప్పించాలి. ఎందుకంటే ఒక కుటుంబానికి బదులుగా రెండు కుటుంబాలు బాలికల చదువుపై ఆధారపడి ఉంటాయి.

ఇంటి వాతావరణం, పరిశుభ్రత అనేవి బాలికల చేతుల్లో ఉంటాయి. బాలికలు చాలా వరకు ఇంటిపనిలో సహకరిస్తుంటారు, చిన్న తమ్ముళ్లను, చెల్లెళ్లను బాగా చూసుకుంటారు. బాలికలకు చదువు ఉన్నట్లయితే వారు తమ కుటుంబ సభ్యులకు, చిన్న తమ్ముళ్లకు, చెల్లెళ్లకు మంచి విద్యను అందించగలరు. బాలిక విద్యావంతురాలయితే, తర్వాత ఆమె తన పిల్లలకు మంచి విద్యను ఇవ్వగలుగుతుంది.



నేటియుగంలో బాలికలు పురుషులతో సమానంగా పనిచేస్తున్నారు. వారు ఉద్యోగాలు చేస్తున్నారు, విమానాలు నడుపుతున్నారు. ఇదంతా విద్యవల్లే జరుగుతోంది. ఇటీవలి కాలంలో సీనియర్ ఉద్యోగాలలో చాలా మంది మహిళలు నియమించబడ్డారు కూడా.

మన దేశ రాష్ట్రపతి కూడా మహిళే. ఆమె పేరు శ్రీమతి ప్రతిభా పాటిల్. బాలికల విద్యకు ఆమె అసలు సిసలు ఉదాహరణ. మనమంతా బాలికల చదువుకు ప్రత్యేక ప్రాధాన్యత ఇవ్వాలి. వారికి చదువుకునే అవకాశం లేని చోటికి మనం వెళ్లి, చదువు ఎంత అవసమో అక్కడివారికి వివరించాలి.

– రాజ్‌కుమార్ కుష్వారా

*8వ తరగతి, మిడిల్ స్కూల్, తరవట*

unicef

**Liked what you read? Send your comments / queries to**

Vibhavari
Sai Estate Colony, D.P.N Bhargav House
Nanakhedi, Guna, Madhya Pradesh Pin- 473001.

**Send us your feedback!**

CHANDAMAMA INDIA LTD.,
B-3, Cross Road 'B', MIDC, Andheri (East), Mumbai-400093.
Phone : +91 22 28312872 / 28311849
Email : chandamama@chandamama.com
Website : www.chandamama.com



# హరిదాసు బుద్ధి

సీతాపురం గ్రామంలో కామాక్షయ్య అనే ఒక హరిదాసు ఉండేవాడు. ఆయన చెప్పే కథలకు శ్రీహరి, గణపతి, చంద్రం అనే వాళ్ళు పక్కవాయిద్యాలతో, వంతపాటతో బాగా రక్తి కట్టిస్తూ ఉండేవాళ్ళు.

కామాక్షయ్య కథ చెప్పేందుకు నూట పదహార్లు తీసుకునేవాడు. ఆ పైన వినే వాళ్ళల్లో కొందరు, ఆయన చెప్పిన హరికథకు సంతోషించి కొంత డబ్బు ఇస్తుండేవాళ్ళు. కథపూర్తవగానే, హారతిపళ్ళెంలో వేసిన డబ్బు కూడా కామాక్షయ్యే తీసుకునేవాడు. అయితే, ఆ విధంగా వచ్చిన మొత్తం డబ్బులో, బహు తక్కువ డబ్బును శ్రీహరికి, గణపతికీ, చంద్రానికీ ఇస్తూండేవాడు. వాళ్ళకు ఆ డబ్బు తీసుకోవటం అసంతృప్తికరంగా ఉన్నప్పటికీ, హరిదాసుకు కోపం వస్తుందే మోనని మారు మాట్లాడేవాళ్ళు కాదు.

ఒకసారి ఆ ముగ్గురూ, కామాక్షయ్య లేని సమయంలో ఆయన ఇంటికివెళ్ళి, హరిదాసు భార్య అచ్యుతాంబతో ఎంతో దీనంగా, "అమ్మా, హరిదాసుగారిని అందరూ చాలా గొప్పగా మెచ్చుకుంటే.. ఆయన ఆ ఘనత కథ చెప్పే తన ఒక్కడిదే కాదనీ, అందులో మా ముగ్గురికీ పాలు ఉన్నదనీ, నలుగురితో అనడమేగానీ, వసూలైన డబ్బులో కొద్దిగా మాత్రమే మాకు ఇస్తు న్నాడు. కుటుంబీకులమైన మాకూ అను నిత్యం ఎన్నో సాధకబాధకాలుంటవి'' అన్నారు.

హరిదాసు భార్య అంతా విని, వాళ్ళతో "మీరు చెప్పకుండానే హరిదాసుగారు, మీతో ఎలా ప్రవర్తిస్తున్నదీ నేను గమనిస్తూనే

ఆరుపల్లి గోవిందరాజులు

ఉన్నాను. ఆయనకు నచ్చని మాట ఏదైనా చెబితే, తీవ్రంగా కోపగించుకుంటాడు'' అన్నది.

''అమ్మా, ఆ సంగతి మేమూ ఎరిగినదే. ఎంతోకాలంగా వారినే నమ్ముకుని వారివెంట తిరుగుతూ సేవ చేస్తున్నాం. ఇప్పుడు ఈ వయసులో, ఈ వృత్తిని మాని ఏ కాయ కష్టమో చేసుకుని బతకలేం కదా'' అన్నారు శ్రీహరి, గణపతి, చంద్రం.

హరిదాసు భార్య కొంచెంసేపు ఆలో చించి, ''సరే, వీలుపడినప్పుడు నేను, వారితో మిమ్మల్ని గురించి చెబుతాను. ఊరికే మనసును కలత పెట్టుకోకండి'' అన్నది.

ఆ రోజు హరిదాసు ఇంటికి రాగానే అచ్యుతాంబ, ఆయనతో, వాయిద్యగాళ్ళ గురించి చెప్పి, ''మీరు చెప్పే కథలు రక్తికట్ట డానికి వాళ్ళ సాయం చాలా ఉన్నదని, అందరితో చెబుతుంటారు! మరి మీకు వచ్చే డబ్బులో, వాళ్ళకూ న్యాయమైన భాగం ఇవ్వవచ్చు గదా'' అన్నది.

ఆ మాటలకు హరిదాసు కోపంగా, ''ఈ న్యాయాన్యాయాల సంగతి, నాకు తెలి యంది కాదు. ఇకముందు వాళ్ళను గురిం చిన ప్రసక్తి, నా దగ్గిర తేకు'' అన్నాడు.

కొంతకాలం జరిగింది. హరిదాసు తన కుమార్తెకు యోగ్యుడైనవాడితో ఘనంగా వివాహం జరిపించాడు. ఆ తరువాత కొంత మాగాణి పొలం కొనుక్కున్నాడు. అయినా, ఎన్నో ఏళ్ళుగా తనవెంట ఉంటున్న



వాయిద్యగాళ్ళకు డబ్బు ఇవ్వడంలో పిసి నారితనం చూపిస్తూనే ఉన్నాడు. ఇక సహించలేక శ్రీహరీ, గణపతీ, చంద్రం హరి దాసు ఇంటికేసి వెళ్ళడం మానుకున్నారు.

ఏం జరిగి ఉంటుందో తెలుసుకుందా మని, ఒకనాడు కామాక్షయ్య ముందుగా శ్రీహరి ఇంటికి వెళ్ళాడు. ఆయనను చూసిన శ్రీహరి భార్య ఆశ్చర్యపోయి, ''తమరు ఇటువచ్చి చాలా కాలామైంది. మా ఆయన, మీ హరికథల గొడవలోపడి కుటుంబ విష యాలు ఏ మాత్రం అసలు పట్టించుకో వటంలేదు. మా అమ్మాయికి పెళ్ళీడు దాటిపోతున్నది. మరింత ఆలస్యం జర క్కుండా, ఎక్కడైనా మంచి సంబంధం చూసుకోవాలి,'' అంటూ తమ కుటుంబ

సమస్యల గురించి హరిదాసుకు చెప్పుకు న్నది.

అంతా విని కామాక్షయ్య, అక్కడినుంచి గణపతి ఇంటికి వెళ్ళాడు. గణపతి భార్య జబ్బుతో మంచంలో ఉన్నది.

గణపతి పదిహేనేళ్ళ కొడుకు ఆయనతో, ''మా నాన్న అశ్రద్ధవల్ల, మా అమ్మకు జబ్బు నయం కాకుండా ఉన్నది. మంచి వైద్యుడి చేత వైద్యం చేయించడానికి మా దగ్గర డబ్బులేదు. పోరగా, పోరగా ఎవరిదగ్గరైనా అప్పు దొరికితే తెస్తానంటూ ఇప్పుడే మానాన్న గ్రామంలోకి వెళ్ళాడు'' అన్నాడు.

కామాక్షయ్య మంచంలో ఉన్న గణపతి భార్యను పలుకరించి, జబ్బేమిటో తెలుసు కుని, అక్కడినుంచి సరాసరి చంద్రం ఇంటికి వెళ్ళాడు.

చంద్రం ఇంటి అరుగుమీద ఒక చాప వేసుకుని దిగులుగా కూర్చుని ఉన్నాడు.

కామాక్షయ్య పలుకరించగానే, ''అయ్యా... నా అసమర్థత, అశ్రద్ధల కారణంగా ఇలా పేదరికం అనుభవిస్తు న్నాను. కూటికీ, గుడ్డకూ చాలని సంపా దనతో, నా భార్యాబిడ్డలకు సుఖం అనేది లేకుండా చేశాను. ఇకనుంచి తమవెంట తిరగలేను. పెద్దవాణ్ణయిపోయాను. ఓపిక సన్నగిల్లింది'' అన్నాడు.

''అలాగా!'' అంటూ కామాక్షయ్య చిన్నగా నవ్వి, ఇంటికిపోయి, వెంటనే వాళ్ళ ముగ్గురినీ పిలిపించి, ఊరిపెద్దల సమక్షంలో, వాళ్ళు తనను గురించి ఏమనుకుంటున్నదీ నిర్భయంగా చెప్పమన్నాడు.

హరిదాసంటే విసిగిపోయి, తెగింపుతో



ఉన్న శ్రీహరీ, గణపతీ, చంద్రం ''ఆయన పిసినిగొట్టూ, ధనాశాపరుడూ'' అంటూ నిర్మొహమాటంగా చెప్పేశారు.

అప్పుడు కామాక్షయ్య, ఇంట్లోనుంచి మూడు సంచుల్లో డబ్బు తెచ్చి వాళ్ళ ముందు పెట్టి, ''మీరు నన్ను అపార్థం చేసుకునేందుకు తగిన కారణాలే ఉన్నవి. కానీ, నేను మీ మేలుకోసమే, ఇవ్వదలచిన డబ్బులో సగం మీకిస్తూ, సగం నా దగ్గిర దాచాను. మీలో నాకున్న నిగ్రహశక్తిలాంటిది లేదు. లోగడే ఈ డబ్బు ఇచ్చి ఉంటే, దుబారాగా ఖర్చుచేసి, వయసుమీరాక ఏ పనీ సక్రమంగా చేయలేక అవస్థలపాలై ఉండేవారు'' అన్నాడు.

''అయ్యా.... ఆ మాటా నిజమే'' అన్నాడు శ్రీహరి.

కామాక్షయ్య ముగ్గురికీ డబ్బు సంచులిచ్చి, ''మీకు ఒక్కొక్కరికీ పదివేల రూపాయలిస్తున్నాను. చంద్రం అన్నట్టు అతడే కాదు మనం నలుగురం పెద్దవాళ్ళమై పోయాము. లోగడలా ఇప్పుడు ఊళ్ళు తిరగలేం. ఇకనుంచి ఇళ్ళపట్టున ఉండి విశ్రాంతి తీసుకుందాం. నేనిచ్చిన డబ్బుతో మీ మీ గృహ సమస్యలు తీరే అవకాశం ఉన్నది. ఒకవేళ అవసరం కలిగితే, నా దగ్గిరకు రండి. తప్పక చేతనైన సహాయం చేయగలను'' అని చెప్పాడు.

శ్రీహరి, గణపతీ, చంద్రం కృతజ్ఞతతో హరిదాసు పాదాలంటి నమస్కరించి, ''అయ్యా, మావల్ల జరిగిన తప్పులేమైనా ఉంటే క్షమించండి!'' అన్నారు.

హరిదాసు ఏదో అనబోతున్నంతలో ఒక గ్రామపెద్ద, ''ఇందులో ఒకరినొకరు క్షమించవలసిందేమీ లేదు. మీ మేలుకోరి కామాక్షయ్యగారు కొంతకాలంపాటు మీ దృష్టిలో పిసినారి అయ్యారు'' అన్నాడు.

అందుకు హరిదాసుతోపాటు, అక్కడ ఉన్నవాళ్ళందరూ పెద్దగా నవ్వారు.





# అజ్ఞాతపండితుడు

చీనాలో విద్వాంసులు పరీక్షలకు కూర్చుని, వాటిలో ఉత్తీర్ణులై, ప్రభుత్వోద్యోగాలు సంపాదించుకునేవారు. పదిహేడు శతాబ్దాల క్రితం ఒక గ్రామంలో పావోస్వాన్ అనే యువకుడైన విద్వాంసుడు పరీక్షకు కూర్చుందామని రాజధానికిబయలుదేరాడు. దారిలో అతనికి మరొక యువక విద్వాంసుడు తటస్థపడ్డాడు. ఈ కొత్త యువకుడు గుండెనొప్పితో బాధపడుతూ ఉండటం చూసి పావో ఆగి, అతడికి సహాయపడబోయాడు. కాని పావో కృషి వృథా అయింది. గుండెపోటుతో బాధపడుతున్న విద్వాంసుడు త్వరలోనే మరణించాడు.

చనిపోయిన యువకుడి పేరేమిటో పావోకు తెలియదు. అతని వద్ద పది వెండి కాసులూ, రచనలతో కూడిన కాగితపు చుట్టా ఉన్నాయి. పావో ఆ కాగితపు చుట్టను శవం మీద కప్పి, ఒకవెండి కాసుతో శవానికి ఉత్తర క్రియలు జరిపి, శవం తలకింద మిగిలిన వెండి కాసులు పెట్టి, శవపేటికతో సహా శవాన్ని పాతేయించాడు.

అతను చనిపోయిన వాడికి అశ్రుతర్పణ విడిచి, ''చనిపోయిన నీకు చాతనైతే, నీవారికి, నువు ఎక్కడ ఉన్నదీ తెలియబరుచుకో. నేను తొందర పనిమీద వెళుతున్నాను. నీకోసం నేనేమీ చేయలేను.'' అని చెప్పి ప్రయాణం కొనసాగించాడు.

అతను రాజధాని చేరి పరీక్షలకు కూర్చుని, వాటిలో ఘనంగా ఉత్తీర్ణుడైనాడు. అతని పేరు చాలా దూరం పాకింది.

పావో రాజధానిలో ఉండగా, ఒక వింత జరిగింది. ఎవరిదీ కాని గుర్రం ఒకటి పావోను ఆశ్రయించింది. అది పావోను విడిచిపెట్టకపోగా, ఇతరులను ఎంత

మాత్రమూ దగ్గిరకు రానివ్వకపోయింది. గత్యంతరం లేక పావో దాన్ని తన సొంతం చేసుకున్నాడు.

అతను రాజధాని నుంచి స్వగ్రామానికి తిరిగి వస్తూ, దారి తప్పాడు. చీకటి పడ బోయే సమయంలో అతనికి ఒక కులీనుల భవంతి కనబడింది. ఆ రాత్రికి ఆ ఇంట తాను తలదాచుకునేటందుకు అవకాశం దొరుకుతుందేమో తెలుసుకుందామని పావో తన పేరు గల కాగితాన్ని ఇంటి నౌకరు కిచ్చి, ''అయ్యగారి దర్శనం కోరానని చెప్పు,'' అన్నాడు. ఆ నౌకరు గుర్రాన్ని పరీక్షగా చూసి లోపలకు వెళ్ళి, ఇంటి యజ మానికి కాగితం ఇస్తూ, ''బాబుగారూ, ఈ చీటీ ఇచ్చిన మనిషి మన పోయిన గుర్రాన్ని కాజేసినవాడే!'' అన్నాడు.

ఇంటి యజమాని కాగితం మీద పావో స్వాన్ అనే పేరు చూసి ''ఈయన గొప్ప పండితుడు. లోపలికి తీసుకురా!'' అని నౌకరుతో అన్నాడు. పావో లోపలకు వచ్చినాక ఆయన ''కిందటేడు నేను పొగొట్టుకున్న గుర్రం మీకు ఎలా దొరికింది?'' అని అడి గాడు. ''నేను రాజధానికి వెళ్ళేటప్పుడు దారిలో నా కొక విద్వాంసుడు తటస్థపడ్డాడు. అతను గుండె నొప్పితో మరణించాడు,'' అంటూ పావో తన కథ అంతా గృహ యజ మానికి వివరంగా చెప్పాడు.

గృహ యజమాని ''వాడు నాకొడుకే అయి ఉండాలి!'' అన్నాడు.

ఆయన మర్నాడు బయలుదేరి వెళ్ళి, పాతిన చోటునుంచి శవ పేటికను తవ్వి చూస్తే, చనిపోయిన ఆయన కొడుకేనని తేలింది. పావో చెప్పినట్లుగానే శవం మీద కాగితం చుట్ట కప్పి ఉన్నది. శవం తల కింద వెండి కాసులు కూడా ఉన్నాయి.

పావో తన కొడుకు పట్ల చూపిన శ్రద్ధకు ఎంతో సంతోషించి, ఆ కులీనుడు ఆస్థానా నికి వెళ్ళి, పావోను గట్టిగా శిఫార్సు చేశాడు. పావో ఉన్నత న్యాయాధికారిగా పనిచేసి గొప్ప కీర్తి తెచ్చుకున్నాడు.





# తాయెత్తు మహిమ

గంగరాజనే గజదొంగ, రాజుగారి ధనాగారాన్ని దోచుకుని, దాన్ని తన రహస్య స్థావరంలో దాచి, దొంగను పట్టుకోవడానికి, రాజు ఎటువంటి ప్రయత్నాలు చేస్తున్నాడో తెలుసుకోవడానికి, మారువేషంలో మళ్ళీ రాజధానికి వచ్చాడు.

వాడు ఒక సత్రం ముందుగా పోతుండగా, సత్రం అరుగుమీద ఒక సాధువు నిద్రపోతూ ఉండటం కనిపించింది. సాధువులు ఎన్నో మహిమలు కలిగి ఉంటారని, వాళ్ల దగ్గిర వుండే ప్రతి వస్తువుకూ ఏదో ఒక మహిమ ఉంటుందనీ, గంగరాజు విని ఉన్నాడు.

అందుచేత వాడు మెల్లగా సాధువును సమీపించి, అతడి దగ్గిర ఏమైనా మహిమ గల వస్తువులు దొరుకుతాయేమో అని జాగ్రత్తగా వెతికాడు. వాడికి సాధువు ముంజేతికి ఉన్న తాయెత్తు ఒకటి కనిపించింది. దాన్ని మెల్లిగా విప్పి గంగరాజు తన ముంజేతికి కట్టుకున్నాడు.

ఆ వెంటనే వాడు, ''గజదొంగ గంగరాజును, నేనే! రాజుగారి ధనాగారాన్ని దోచుకున్నది కూడా నేనే!'' అని అరిచాడు.

తనకు తెలియకుండానే, తన నోటి నుంచి నిజం బయటపడేసరికి వాడు హడలిపోయి, తాయెత్తును ఊడదీసి దూరంగా విసిరివేశాడు.

కాని, అదిపోయి వేగంగా తిరిగివచ్చి, వాడి చేతికి చుట్టుకున్నది. ఇలా రెండు, మూడుసార్లు జరిగిన తరవాత గజ దొంగ విసిగిపోయాడు. ఈలోపల వాడి కేకలు విని, అటువైపు వెళుతున్న రాజభటులు

మల్లవరపు మనోహరరెడ్డి

వచ్చి, వాణ్ణి వెంటనే రాజు దగ్గిరకు లాక్కుపోయారు.

రాజు, భటులు చెప్పింది పూర్తిగా విని, ''ఏ దొంగ కూడా తాను దొంగనని చెప్పుకోడు. తనంతటది తాను దొంగను అని ఒప్పుకుంటున్నాడు అంటే దీంట్లో ఏదో తిరకాసు ఉంది. అయినా వీడి స్థావరానికి వెళ్లి చూసి రండి. వీడు అబద్ధం చెప్పి ఉంటే, తల కొట్టించి కోట గుమ్మానికి వేలాడదీయిస్తాను,'' అన్నాడు.

భటులు, గంగరాజుతో వాడి స్థావరానికి వెళ్లి, వాడు దోచుకుపోయిన ధనంతో తిరిగి వచ్చారు.

రాజు ఆశ్చర్యపడి, ''వీడు గజదొంగ గంగరాజనేదాంట్లో ఎటువంటి సందేహం లేదు. అయితే, వీడు నిజం చెప్పడంలో, ఏదో కిటుకున్నది. అది బయటపడేంత వరకూ, వీడిని ఖైదులో ఉంచండి,'' అన్నాడు.

ఆ రాత్రి గంగరాజు, కారాగారానికి కాపలా ఉన్న భటుడితో మెల్లిగా మాటలు కలిపి, తన చేతికి చుట్టుకుని ఉన్న తాయెత్తును భటుడికి చూపిస్తూ ''ఈ తాయెత్తు గొప్ప మహిమలు కలది. ఒకసారి కట్టుకుని చూడు. దీని సంగతి నీకే తెలుస్తుంది,'' అన్నాడు.

భటుడు తాయెత్తు కట్టుకుని వెంటనే ''కాపలా సమయంలో, నేను నిద్రపోతుంటాను. అయినా, ఎవరూ నేను నిద్రపోతున్నట్లు తెలుసు కోలేరు. దానికి కారణం,



నేను కళ్లు తెరుచుకునే గాఢనిద్రపోగలను,'' అన్నాడు.

భటుడి రహస్యం తెలుసుకున్న గంగరాజు, ఒక రాత్రివేళ, కారాగారం తలుపు చువ్వలు విరిచి పారిపోయాడు.

తెల్లవారాక జరిగింది తెలుసుకున్న కాపలాభటుడు, రాజు దగ్గిరకు పోయి, ''గజదొంగ గంగరాజు పారిపోయాడు. ఆ పారిపోయింది నా వల్లనే,'' అని తప్పు ఒప్పుకున్నాడు.

ఆయన భటుడు చెప్పింది విని కోపంగా ''గంగరాజును నువ్వెందుకు పారిపోనిచ్చావు?'' అని అడిగాడు. ''ప్రభూ, వాడిచ్చిన తాయెత్తువల్ల, నా మనసులో ఉన్న రహస్యం వెంటనే బయటపెట్టేశాను,'' అని



భటుడు తన చేతికి ఉన్న తాయెత్తును ఊడదీసి రాజుకు ఇచ్చాడు.

రాజు వెంటనే దాన్ని దూరంగా విసిరి వేశాడు. అయితే తాయెత్తు వెంటనే తిరిగి వచ్చి, రాజు చేతికి చుట్టుకున్నది. ఇంకొకరు తీసుకోనిదే, అది వదలదని తెలుసుకున్న రాజు, ఒక రోజు పాటు దాన్ని తన వద్దనే ఉంచుకుని, తన మీద ప్రజలకూ, ప్రభుత్వోద్యోగులకూ ఎలాంటి అభిప్రాయం ఉన్నదో తెలుసుకోదలిచాడు.

ఆ మర్నాడు, ఆయన సభ చేసి సభికుల్లో నుంచి ఒకణ్ణి పిలిచి, వాడి చేతికి తాయెత్తు కట్టాడు. వెంటనే వాడు, పెద్దగా గొంతెత్తి, ''ప్రజలపై అధిక పన్నుల భారం మోపకుండా పాలించ గలిగిన నాడు, నిన్ను మహారాజుగా గుర్తించగలం!'' అన్నాడు.

తర్వాత రాజు తాయెత్తును ఒక భటుడికి కట్టాడు.-వాడు, ''చాలీచాలని వేతనం ఇచ్చి, గొడ్డు చాకిరీ చేయిస్తున్న ఈ రాజంటే పరమద్వేషం!'' అన్నాడు.

చివరకు సేనాపతి తాయెత్తు కట్టుకుని ''విలాసవంతమైన రాజు జీవితం అంటే నాకెంతో ఇష్టం. ఏ సింహాసనమైనా అధిష్టించ గలిగే అదృష్టం ఉంటే, ఎంత బాగుంటుంది!'' అన్నాడు.

ఈ సంఘటనతో రాజుకు మనసు చెడి ఆ రాత్రి నిద్రపట్టలేదు. ప్రజాక్షేమం కోసం తానెన్నో మంచి పనులు చేస్తున్నప్పటికీ, ఉద్యోగులకూ, నమ్మకంగా మెలిగే సేనాపతికీ కూడా– ఏదో ఒక కారణంగా తనంటే ద్వేషమే! వీళ్లనా తనింతకాలంగా నమ్ముతూ వస్తున్నది, అని ఆయన రాత్రంతా బాధపడుతూ గడిపాడు.

తెల్లవారగానే ఆయన, మంత్రికి కబురు పంపి, జరిగింది చెప్పి, ''నాకెందువల్లనో, రాజ్యపాలన పట్ల విరక్తి కలుగుతున్నది,'' అన్నాడు.

మంత్రి చిరునవ్వు నవ్వి, ''ప్రభూ, దీనికంతకూ, ఆ తంపుల మారి తాయెత్తు కారణం. మీరు మనుషుల్లో మర్మం, ఒడ్డున ఉండి నీళ్లలోతూ తెలుసుకోవాలనుకోవడం పెద్ద పొరపాటు. ముందు మీరా తాయెత్తును వదిలించుకోండి. తర్వాత అన్నీ వాటంతటవే చక్కబడతాయి,'' అన్నాడు.

రాజుకు, ఈ సలహా నచ్చి, కొలువులో వున్న వాళ్ల నొక్కొక్కరిని ఆ తాయెత్తు తీసుకోమని అడిగాడు. కాని దాని సంగతి అప్పటికే తెలిసి ఉండటం వల్ల ఎవరూ దాన్ని తీసుకుని తమ చేతికి కట్టుకోవడానికి సాహసించలేదు.

రాజు విసిగిపోయి, ఆ తాయెత్తును కట్టుకున్నవాళ్లకు పెద్ద బహుమానం ఇస్తానని, నగరంలో చాటింపు వేయించాడు. అప్పటికి ఎవరూ ముందుకు రాకపోయేసరికి, రాజుకు తాయెత్తు, ఒక పెద్ద సమస్య అయిపోయింది. ఎప్పుడూ రాచకార్యాల్లో మునిగితేలుతుండే ఆయన నోట తాయెత్తు మహిమవల్ల నిజం దాగడం లేదు.

చివరకూ రాజు, మంత్రికి తన పరిస్థితి వివరించి, ''మీరే, ఈ తాయెత్తు వదిలే మార్గం ఆలోచించాలి,'' అని కోరాడు.

మంత్రి అందుకు రాజునుంచి మూడు రోజులు గడువు తీసుకుని వెళ్లిపోయాడు.

మూడవ రోజున మంత్రి, ఒకడిని వెంటబెట్టుకుని రాజు దగ్గిరకు వచ్చి, ''ప్రభూ, తాయెత్తును కట్టుకోవడానికి, ఇతను అంగీకరించాడు. చేతికి కట్టండి!'' అన్నాడు.

రాజు తాయెత్తును వాడి చేతికి కట్టి, ఏం మాట్లాడతాడో అని ఎదురు చూశాడు. కాని, వాడెంతకూ మాట్లాడకపోయేసరికి, ఆయన ఇస్తానని చాటింపు వేయించిన బహుమతిని వాడికిస్తూ, ''ఇంతవరకూ, తాయెత్తు కట్టుకోగానే నిజం మాట్లాడే వాళ్లను చూశాను. మీరెవరో మహానుభావుల్లా ఉన్నారు! అందువల్లనే, ఈ తాయెత్తు మహిమ, మిమ్మల్నేమీ చేయలేకపోయింది,'' అన్నాడు.

అందుకు మంత్రి చిన్నగా నవ్వి, ''ప్రభూ, ఇతేనేం మహానుభావుడు కాదు. మూగవాడు! ఇతనికి తప్ప, ఈ రాజ్యంలో తాయెత్తును కట్టుకునే ధైర్యం మరెవరికీ లేదు,'' అన్నాడు.





# రెండు నగరాలు

ఒక ఓడవ్యాపారి వద్ద వామాంగుడనే ఒక బానిస ఉండేవాడు. వామాంగుడు తన వ్యాపారంలో ఎంతో సహాయపడి, లాభాలు సమకూర్చి పెట్టటం చేత యజమాని అతనికి స్వేచ్ఛ ఇస్తూ, ''నా ఓడల్లో ఒకటి తీసుకుని స్వతంత్రంగా వర్తకం సాగించి, బాగుపడు'' అన్నాడు.

వామాంగుడి తొలి వర్తక ప్రయాణం అచ్చి రాలేదు. సముద్ర మధ్యంలో తుఫాను వచ్చి, సరుకులన్నిటితో సహా అతని ఓడ మునిగిపోయింది. నావికులంతా సముద్రం పాలయ్యారు. వామాంగుడు మాత్రం ఈదుకుంటూ వెళ్ళి ఒక తీరాన్ని చేరుకున్నాడు.

అది ఒక చిన్న ద్వీపం. వామాంగుడు ద్వీపంలోకి ప్రవేశించి, కొంతదూరం నడిచి, అందమైన ఒక పెద్ద నగరం చేరుకున్నాడు.

నగర వీధుల గుండా జనమున్నారు. వారు తన కోసమే గుంపులుగా కూడినట్టు వామాంగుడికి కనిపించింది. అతను సమీపానికి రాగానే, ''మహారాజుకు జై!'' అని జనం నినాదాలు చేశారు. ఇది చూసి వామాంగుడు మరింత ఆశ్చర్యపడి, ''వీళ్ళు నన్ను చూసి మరొకరని భ్రమపడుతున్నట్టున్నారు'' అనుకున్నాడు.

జనం వామాంగుడి చుట్టూ మూగారు. అక్కడికి అలంకరించిన ఏనుగు ఒకటి వచ్చింది. జనం వామాంగుణ్ణి ఏనుగు అంబారీలో ఎక్కించి, రాజమర్యాదలతో రాజ భవనానికి తీసుకుపోయారు.

తరువాత రాజ భవనంలో అతని దుస్తులను తీసివేసి ఒక పెట్టెలో భద్రపరచి, అతనికి స్నానం చేయించి, రాజోచితమైన దుస్తులు

ధరింపజేశారు. వామాంగుడు తన చుట్టూ ఉండేవారిని, ''మీరు నన్నీవిధంగా రాజును చెయ్యటంలోగల అంతరార్థమేమిటి? నన్ను మీరెరగరు. మిమ్ము నేనెరగను. ప్రమాదవశాన సముద్రం మీద నా ఓడ మునిగి దైవికంగా ఇక్కడ వచ్చిపడ్డాను. అంతేగానీ పనిపెట్టుకుని ఈ దేశం వచ్చిన వాణ్ణి కాను'' అన్నాడు.

అప్పుడక్కడివారు అతనికి ఆ దేశం గురించి చెప్పారు. ఇరవైరెండేళ్ళ క్రితందాకా ఆ ద్వీపం మీద క్రమపరిపాలన అంటూ ఉండేది కాదు. జీవితం అరాచకంగా ఉండేది.

ఆ సమయంలో ఆ ద్వీపానికొక దేశ సంచారి వచ్చాడు. ఒక రాజు ఉండి శాసించి నట్లయితే జీవితం క్రమబద్ధంగా అభివృద్ధి చెందుతుందనీ, రాజశాసనం ద్వారా పైకి వచ్చిన దేశాలెన్నో ఉన్నాయనీ, రాజు నిరం కుశుడై ప్రజలను పీడించకుండా ఉండా లంటే ఏడాది కాగానే ఉన్న రాజును తొల గించి కొత్తరాజును పెట్టుకోవచ్చుననీ, రాజు ప్రజలలో ఒకడుగా ఉండేదానికన్నా పైవా డైతే పరిపాలన నిష్పక్షపాతంగా ఉంటుం దనీ, ఆ దేశసంచారి చెప్పాడు. అది మొదలు అక్కడివాళ్ళు యాదృచ్ఛికంగా తమ ద్వీపా నికి వచ్చేవాణ్ణి రాజుగా చేసుకుని, అతన్ని పరిపాలించనిస్తున్నారు. ఏడాది పూర్తికాగానే రాజును తొలగించి సమీపంలో ఉండే అరణ్యంలోకి పంపేసి, కొత్తవాడి కోసం ఎదురు చూస్తారు. అరణ్యానికి పంపబడ్డ వాడు ఎలా బతుకుతాడో, ప్రజలకు ఏ మాత్రం పట్టదు.



ఈ విధంగా ఈ ద్వీపానికి ఇంతవరకూ ఇరవైఇద్దరు రాజులయ్యారు. వామాంగుడు ఇరవైమూడో రాజు.

వామాంగుడికి తనకు పట్టిన రాజ యోగం గురించి సంతోషంకన్న, ఏడాది అయ్యాకపట్టబోయే అరణ్యవాసం గురించి శ్రద్ధ ఎక్కువ కలిగింది.

అతను కొందరు భటులను వెంటబెట్టు కుని అరణ్యానికి పోగోరాడు. ఈ ద్వీపానికి దగ్గరలో మరొక ద్వీపంపైన ఆ అరణ్యం ఉన్నది. అక్కడికి పడవల్లో వెళ్ళాలి.

వామాంగుడు భటులు వెంటరాగా, పడవల్లో అరణ్యం చేరాడు. తరవాత, నాలుగు రోజులు అక్కడే ఉండి, అరణ్యాన్ని ఆమూలాగ్రం జాగ్రత్తగా పరిశీలించాడు. అందులో మనుషులు జీవించటం కష్టం. అయితే అక్కడ మంచి కలప, పంటలు పండించేందుకు కావలసినంత సారవంత మైన భూమి ఉన్నదీ.

అడవి చెట్లన్నీ కొట్టించి అక్కడే మంచి నగరం నిర్మించవచ్చు. పళ్ళతోటలూ, పూల తోటలూ వేయవచ్చు.

వామాంగుడు ఆ పనికి మనుషులను నియోగించాడు. అతని ఏలుబడి ఏడాది పూర్తి అయ్యేలోగా అరణ్యం అందమైన నగరంగా మారిపోయింది. నగరంచుట్టూ అందమైన తోటలు ఏర్పడ్డాయి. నగరం నిర్మించటానికి శ్రమించినవారు ఈ కొత్త నగరంలోనే నివసించగోరారు.

ఏడాది పూర్తి అయ్యింది. వామాంగుడు కొత్త నగరానికి వచ్చేశాడు. అతనితోపాటు అనేకమంది పౌరులు, పాత నగరంవారు, కొత్త నగరానికి వలస వచ్చేశారు.

ఇది జరిగాక, పాత నగరం వారికి వామాంగుణ్ణి పోగొట్టుకోవటం ఇష్టం లేక పోయింది. అప్పటికప్పుడే వారొక సభ చేసి, రెండు నగరాలకూ వామాంగుడే శాశ్వతంగా రాజుగా ఉండాలని తీర్మానించారు.



# కెరీర్ అంటే?

గత నెల భారతదేశంలోని పలు విద్యాసంస్థలు, విశ్వవిద్యాలయాల గురించి ప్రస్తావించాము. వాటిలో అత్యుత్తమమైన వాటిని కింది పట్టికలో ఇస్తున్నాము:

| Name of the Institute | Address | Phone and E-mail |
|---|---|---|
| Oberoi Centre, Delhi. | 7, Sham Nath Marg, Delhi-110 054, India. | Ph : +91-11-2389 0505<br>E-mail : careers@eih-india.com<br>Web : www.oberoihotels.com/careers |
| IHM, Mumbai. | Veer Sawarkar Marg, Dadar (WR), Mumbai- 400 028 | Ph : 022-4457241/42,<br>Fax : 022-4449779 |
| WGSHA, Manipal | Valley View, Manipal 576119 | Ph : 08252-571101,<br>Fax : 08252-571327<br>E-mail : office.wgsh@manipal.edu |
| IHM, Delhi | National Council for Hotel Management & Catering Technology, Pusa New Delhi. | Ph:- 5751756, 5782799, 5781060, 5717411 |
| IHM, Aurangabad | Dr Rafiq Zakaria Campus, Rauza Bagh, Aurangabad 431 001 Maharashtra, India. | Ph : 0240-238 1113, 0240-2381127<br>Fax : 0240-2381104,<br>E-mail : enquiry@ihmaurangabad.ac.in |
| IHM, Bangalore. | S.J. Polytechnic Campus, Seshadri Road, Bangalore 560 001 India. | Ph : 91-80-2226 2960, 91-80-2238 6763<br>Fax : 91-080-22268562,<br>E-mail : ihm@vsnl.com |
| IHM, Chennai. | CIT Campus, TTTI - Taramani P.O., Chennai - 600 113. | Ph : 044-22542029,<br>Fax : 044-22541615<br>E-Mail: ihmchen@dataone.in |
| IHM, Calcutta | P-16, Taratola Road, Calcutta – 700 088. | Ph : 033-4784218,<br>Fax : 033-4784281 |
| IHM, Ahmedabad. | Govt. Polytechnic Compound, Ahmedabad - 380 015. | Ph : 079- 401339,<br>Fax : 079-6568017 |
| Christ College, Bangalore . | Hosur Road, Bangalore 560 029. | Ph : 080-25526169/164,<br>Email : princi@christcollege.edu |

\- సాయి

# చందమామ లోకజ్ఞానం క్విజ్ - 25

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

**Co-sponsored by Infosys FOUNDATION, Bangalore**

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి ₹.250/-*

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్లయితే ఒక్కొక్క విజేతకు ₹.50/- బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే :

1. సమాధానాలు రాయండి.
2. మీ పేరు, వయసు(16 ఏళ్ళ లోపు ఉండాలి) పిన్ కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి.
3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి.
4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్ -25 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి.
5. మార్చ్ నెలాఖరులోగా మీ ఎంట్రీలు మాకు అందాలి.
6. మే 2011 సంచికలో ఫలితాలు వెలువడుతాయి.

## టెక్నాలజీ వివరాలు




1. మైక్రోఫోన్‌ని మొట్టమొదటగా ఎవరు ఎక్కడ కనిపెట్టారు?
2. WWW అనేసంక్షిప్తపదం దేన్ని సూచిస్తుంది?
3. సాంకేతికంగా అత్యాధునికమైన హ్యూమనాయిడ్ రోబో ASIMOను తయారు చేసిన కార్ల కంపెనీ ఏది?
4. సౌరశక్తితో తయారయ్యే విద్యుత్‌కి మూలం ఏది?
5. డీ.ఎన్.ఏ అనేది డయాక్సిరైబోన్యూక్లిక్ యాసిడ్ సంక్షిప్త పదం. నిజమా, కాదా?
6. ఇన్‌ఫ్రారెడ్ కాంతి తరంగదైర్ఘ్యం మానవులు చూడడానికి వీలైనంత పొడవుగా గాని కురచగా గాని ఉంటుందా?

## చందమామ లోకజ్ఞానం క్విజ్-23 డిసెంబర్ 2010 సమాధానాలు

1. 1896లో గ్రీక్‌లో నిర్వహించారు, 2. 1924, 3. 400, 4. బీజింగ్, 5. 1916లో మొదటి ప్రపంచ యుద్ధం కారణంగా, 1940, 1944లో రెండవ ప్రపంచ యుద్ధం కారణంగా రద్దు చేశారు, 6. 2012 లండన్‌లో నిర్వహిస్తారు.

*Dec'10 Winner: V. Balakota Bhavana, Kota-524411, Nellore(Dist), A.P.*

# నవ్వుల పువ్వులు



టీచర్: రామూ, పాలు కలిసిన అయిదు వస్తువుల పేర్లు చెప్పగలవా?
రాము: ''ఐస్‌క్రీమ్, టీ, కాఫీ, ఖీర్......''
టీచర్: సరిగ్గా చెప్పావు. ఇంకా...!
రాము: ''మా రెఫ్రిజిరేటర్, మా పొరుగింట్లో ఆవు!''



ఒక గున్న ఏనుగు ఒక రోజు ఉదయాన్నే, జీవితంలో తొలిసారిగా చిట్టెలుకను చూసి ఆశ్చర్యపోతూ అనుకున్నది ''ఎంత చిన్న జీవి!''

''నేనిలా కనిపించకపోతే ఆశ్చర్యపోవాలి. జబ్బుగా ఉంది, దాంతో గత రాత్రి నేను ఏమీ తినలేకపోయాను,'' అంటూ వాపోయింది చిట్టెలుక.



అతిథులు భోజనాల బల్ల వద్ద కూర్చున్నారు.

అమ్మ మానసితో చెప్పింది, ''ప్రార్థన చేస్తావా కన్నా''

''ప్రార్థన ఎలా చేయాలో నాకు తెలీదు,'' మానస చెప్పింది.

''అమ్మ నుంచి ఏం విన్నావో అదే చెప్పు చాలు,''

మానసి తలవంచి ఇలా అంది, ''దేవుడా, ఈ భూమ్మీద వీళ్లందరినీ నేను విందుకు ఎందుకు ఆహ్వానించాను?''



టీచర్ ఏడేళ్ల పిల్లలకు తరగతి గదిలో సామాన్య విజ్ఞాన పాఠం చెబుతోంది. ''పనిచీమలు తమ బరువుకు అయిదు రెట్లకు సమానమైన ఆహారాన్ని మోసుకుపోగలవు. పిల్లలూ దీన్నుంచి మీరేం నేర్చుకున్నారో చెప్పండి?''

రోహన్ అందుకుని చెప్పాడు. ''వాళ్లకు యూనియన్ లేదు మరి!''

# సుడోకు పజిల్

కింది సుడోకు పజిల్‌ని పరిష్కరించి, మీ పరిష్కారాలను మాకు పంపించండి.
పరిష్కారానికి సూచనలు: ప్రతి వరుసలో 1 నుంచి 9 వరకు అంకెలు అడ్డంగా, నిలువుగా నింపండి. ఒక వరుసలో ఒక అంకెను ఒకసారి మాత్రమే వాడాలి. ప్రతి 3X3 చదరంలోనూ 1 నుండి 9 అంకెలు ఉండాలి. పజిల్‌కు పరిష్కారం ఏప్రిల్ 2011 సంచికలో ప్రచురించబడుతుంది. సరైన సమాధానాలు పంపిన విజేతల్లో ఒక్కో భాషలో ఒక్కొక్కరికి ₹.500/- బహుమతి ఉంటుంది.

| | | | | 2 | | 4 | 5 | |
|---|---|---|---|---|---|---|---|---|
| 6 | | 5 | | | 1 | | | |
| | | | | | | | 9 | |
| | 3 | 8 | | | | | | |
| | | | 8 | | | | | 7 |
| | 4 | 9 | | 5 | | 2 | | |
| | | | | | 7 | | | 3 |
| | 5 | | | 9 | | | 2 | |
| 9 | | | 6 | | | | | |

## Dec'10 Winners

K. Snehapriya, Mumbai-400101
V. Ramesh, Yetapaka-507112
T. UdayaSankar, Palakol-534260
C.H. Ramesh, Hyderabad-500048
S.A. Kesavan, Kovilapatti-628502
V.K.M. Mohanarajan, v.mettur-641658
Sri Mohananandji, Amrali-364220
B. Rajanikant, Tararua-752055
Shaktirekha Roy, B.M. Marg-756001
R. Manali, Mysore-570023
K. Lakshmi mallikaa, Mysore-570020
Amogh Gajanan Joshi, Lokmanyanagar-400606

మీ ఎంట్రీలను 2011 మార్చ్ 25వ తేదీలోగా పంపించండి. పంపవలసిన చిరునామా:

**SUDOKU PUZZLE, CHANDAMAMA INDIA LTD.,**
Plot No.2, Swathi Enclave Nos. 5 & 6, Amman Koil Street, Vadapalani, Chennai-600026. e-mail your entries to:contests@chandamama.com

డిసెంబర్ 10 సుడోకు పజిల్స్‌కు సరైన పరిష్కారాలు:

పజిల్ - 1

| 7 | 2 | 6 | 5 | 1 | 3 | 4 | 8 | 9 |
|---|---|---|---|---|---|---|---|---|
| 8 | 1 | 3 | 7 | 4 | 9 | 6 | 5 | 2 |
| 5 | 4 | 9 | 6 | 8 | 2 | 3 | 1 | 7 |
| 9 | 3 | 5 | 1 | 6 | 8 | 7 | 2 | 4 |
| 1 | 6 | 4 | 3 | 2 | 7 | 8 | 9 | 5 |
| 2 | 8 | 7 | 9 | 5 | 4 | 1 | 3 | 6 |
| 4 | 9 | 1 | 2 | 3 | 6 | 5 | 7 | 8 |
| 3 | 7 | 8 | 4 | 9 | 5 | 2 | 6 | 1 |
| 6 | 5 | 2 | 8 | 7 | 1 | 9 | 4 | 3 |

పజిల్ - 2

| 5 | 7 | 9 | 2 | 4 | 8 | 1 | 6 | 3 |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 3 | 8 | 6 | 7 | 5 | 2 | 4 | 9 |
| 6 | 2 | 4 | 1 | 3 | 9 | 5 | 7 | 8 |
| 3 | 5 | 7 | 4 | 6 | 1 | 8 | 9 | 2 |
| 9 | 4 | 1 | 7 | 8 | 2 | 3 | 5 | 6 |
| 8 | 6 | 2 | 9 | 5 | 3 | 4 | 1 | 7 |
| 2 | 9 | 5 | 3 | 1 | 7 | 6 | 8 | 4 |
| 7 | 8 | 6 | 5 | 2 | 4 | 9 | 3 | 1 |
| 4 | 1 | 3 | 8 | 9 | 6 | 7 | 2 | 5 |

# మౌతార్గాన్

ఈ ఐస్ క్రీమ్ స్టిక్ వినిపించే సంగీతం మిమ్మల్ని ఖచ్చితంగా పరవశింపజేస్తుంది.

## ఏమేం కావాలి?

రెండు ఐస్ క్రీమ్ బద్దలు, 1X12 సెంటీమీటర్ల కాగితపు ముక్క, రెండు అగ్గిపుల్లలు, రెండు రబ్బరు బాండ్‌లు.





## తయారు చేయడం ఎలా?



- పేపర్ ముక్కను ఐస్ క్రీమ్ బద్దపై ఉంచండి.
- రెండు కొసలకు దగ్గిరగా రెండు చిన్న అగ్గిపుల్ల ముక్కలను ఉంచండి.
- రబ్బర్ బ్యాండ్లను చివరలలో చుట్టండి.
- మీ నోట్లో మౌతార్గాన్‌ని పెట్టుకుని దాన్ని ఊదితే సంగీత శబ్దం వస్తుంది.





కాన్సెప్ట్: మౌతార్గాన్‌ని మీరు వాయిస్తున్నప్పుడు పేపర్ ముక్క ప్రకంపనలకు గురై ఉచ్ఛ ధ్వనిని ఏర్పరుస్తుంది.

*రచన: అరవింద గుప్తా (పూణెలోని ఇంటర్ - యూనివర్శిటీ సెంటర్ ఫర్ ఆస్ట్రానమీ అండ్ ఆస్ట్రో ఫిజిక్స్ భాగంలో విజిటింగ్ సైంటిస్టుగా పనిచేస్తున్నారు.)*

# మన దేశభాషలు నేర్చుకుందాం

ఈ జాబితాలో మొదట మీకు తెలిసిన భాషలలోని పదాలను చదవండి.
ఆ తరవాత వాటి కింద ఇచ్చిన పదాలను అనుసరించి ఆయా భాషలలో ఆ పదాల
ఉచ్చారణలనూ, అర్థాలనూ నేర్చుకోడానికి ప్రయత్నించండి.





| English | Don't worry. | Let us meet again. |
|---|---|---|
| Telugu | బాధపడకండి. | మనం మళ్లీ కలుద్దాము. |
| Hindi | चिन्ता मत करो।<br>చింతా మత్ కరో. | हम फिर मिलेंगे।<br>హమ్ ఫిర్ మిలేంగే. |
| Tamil | கவலைப்படாதே<br>కవలైపడాదే. | மீண்டும் சந்திப்போம்<br>మీండుమ్ సందిప్పోమ్. |
| Bengali | চিন্তা কোরও না।<br>చింతా కరో నా. | আমাদের আবার সাক্ষাৎ করা যাক।<br>అమాదెర్ అబ్బార్ సాక్షాత్ కరా జాక్. |
| Marathi | काळजी करु नकोस.<br>కళ్జి కరు నకోస్. | पुन्हा नक्की भेटूया.<br>పున్హ నక్కీ భేటుయా. |
| Kannada | ಚಿಂತಿಸಬೇಡಿ.<br>చింతిసబేడి. | ಪುನಃ ಭೇಟಿಯಾಗೋಣ.<br>పునః భేటియాగోణ. |
| Oriya | ବ୍ୟସ୍ତ ହୁଅନ୍ତୁ ନାହିଁ।<br>బ్యెస్తొ హోంతు నాహి న్. | ପୁଣି ଭେଟିବା।<br>పుణి భెటిబా? |
| Gujarati | ચિંતા કરશો નહીં.<br>చింతా కరషో నహీ. | ચાલો ત્યારે, ફરી મળીશું.<br>చాలో త్యారే, ఫారీ మలీషు. |
| Assamese | চিন্তা নকৰিব।<br>సింతా నకోరిబో. | আমি আকৌ এবাৰ লগ পাওঁ আহক।<br>ఆమి ఆకో ఎబ్బారా లోగ్ పావో ఆహోక్ |
| Malayalam | വിഷമിക്കേണ്ട.<br>విషామిక్కేండా. | വീണ്ടും കണ്ടുമുട്ടാം.<br>వేండుమ్ కందుముట్టమ్. |
| Santali | ᱟᱞᱚᱢ ᱫᱩᱠᱷ-ᱟ।<br>ఆలోమ్ దుఖ్-ఆ. | ᱛᱚᱵᱮ ᱫᱩᱦᱩᱞᱟ ᱞᱟᱝ ᱧᱟᱯᱟᱢᱟ।<br>టోబె దుహులా లాంగ్ క్యాపామా. |
| Sanskrit | चिन्ता मास्तु ।<br>చింతా మాస్తు. | पुनर्मिलामः।<br>పునర్మిలామః |






| English | What do you do ? | I am a teacher. |
|---|---|---|
| Telugu | మీరేం చేస్తున్నారు? | నేను ఉపాధ్యాయుడిని. |
| Hindi | तुम क्या करते हो?<br>తుమ్ క్యా కర్తే హో? | मैं एक शिक्षक हूँ।<br>మైన్ ఏక్ శిక్షక్ హూన్. |
| Tamil | நீ என்ன செய்கிறாய்?<br>నీ ఎన్నా సెయిగిరాయ్? | நான் ஓர் ஆசிரியர்<br>నాన్ ఒరె ఆసిరియర్. |
| Bengali | আপনি কী করেন?<br>ఆప్ని కి కరేన్? | আমি একজন শিক্ষক।<br>ఆమి ఎక్జోన్ శిక్షక్. |
| Marathi | तुम्ही काय काम करता?<br>తుమ్హీ కే కామ్ కర్తా? | मी शिक्षक आहे.<br>మీ శిక్షక్ ఆహె. |
| Kannada | ನೀವೇನು ಮಾಡುತ್ತಿದ್ದೀರಿ?<br>నీవెన్ను మాడుత్తిద్దేరి? | ನಾನೊಬ್ಬ ಶಿಕ್ಷಕ/ಕಿ.<br>నానోబ్బ శిక్షక/కి |
| Oriya | ତୁମେ କଣ କରୁଛ?<br>తుమె కణా కరుచ్ఛా? | ମୁଁ ଜଣେ ଶିକ୍ଷକ।<br>మున్ జానె షిక్షకా. |
| Gujarati | તમે શું કરો છો?<br>తమె షు కరో చ్ఛో? | હું એક શિક્ષક છું.<br>హు ఏక్ శిక్షకా చ్ఛు. |
| Assamese | আপুনি কি কৰে?<br>ఆపుని కి కొరె. | মই এজন শিক্ষক।<br>మోయి ఎజోన్ శిక్కోక్. |
| Malayalam | നിങ്ങൾ എന്തുചെയ്യുന്നു?<br>నీంగల్ ఎంతు చెయ్యున్ను? | ഞാൻ ഒരു അധ്യാപകനാണ്.<br>న్యాన్ ఒరు అధ్యాపకన్ను. |
| Santali | ᱪᱮᱫ ᱮᱢ ᱪᱤᱠᱟᱹ ᱮᱫᱟ?<br>చెద్ ఎమ్ చికా్ ఎడా? | ᱤᱧ ᱢᱟᱪᱮᱛ ᱠᱟᱱᱟᱹᱧ।<br>ఇక్డో మాచెట్ కానాఖ్. |
| Sanskrit | भवान् / भवती किं करोति ?<br>భవాన్/భవతీ కిమ్ కరోతి? | अहं शिक्षक: / शिक्षिका अस्मि ।<br>అహం శిక్షకః/శిక్షికా అస్మి. |

## మంచినీళ్ల బావికి ఆహ్వానం



పుట్టిన రోజు శుభకార్యం కావచ్చు, పెళ్లి లేదా సామాజిక ఉత్సవం కావచ్చు, మనం ముందుగా పెద్దలను ఇంటికి రావలసిందిగా ఆహ్వానిస్తాం. ఇది మన ఆచారం. కాని, ఉత్తర ప్రదేశ్‌లోని ఒక గ్రామంలో ప్రజలు ఏ శుభకార్యానికైనా ముందుగా ఊరబావికి ఆహ్వానం పంపుతారు.

ఉత్తర ప్రదేశ్ రాష్ట్రం ఎటావా జిల్లాలోని నాగ్లా రామ్‌లాలా గ్రామంలో స్థానికులు గత 50 ఏళ్లుగా ఈ వింత ఆచారాన్ని పాటిస్తూ వస్తున్నారు. అచ్చురూపంలో కాని లేదా చేతితో రాసినవి కాని.. ఆహ్వానపత్రాలు బావిలో జారవిడుస్తుంటారు. ఈ గ్రామం మొత్తానికి మంచినీళ్లకు ఏకైక ఆధారం ఈ బావే మరి.

నాగ్లా రామ్‌లాలా గ్రామంలో 1000 మంది ప్రజలు నివసిస్తుంటారు. ఊర్లో చాలా మంది పాల వ్యాపారం చేస్తుంటారు. మంచినీటి బావికి ఆహ్వాన పత్రాలు సమర్పించే సంప్రదాయాన్ని పాటించకపోతే, బావి ఎండిపోయి తీవ్రమైన నీటి కొరతకు దారితీస్తుంది. బావి ఎండిపోయిన ప్రతిసారీ ఊర్లో అనేకమంది జనం చనిపోతూ వచ్చారని ఊరి ప్రజల భావన.

## 63 ఏళ్ల తర్వాత విద్యుత్తు

ఇండోర్ సమీపంలోని కొండప్రాంతంలో నెలకొన్న చిన్న గ్రామం కోపర్‌వెల్. 20 ఇళ్లు మాత్రమే ఉన్న ఈ గ్రామంలోని ఒక గుడిసెలో ఇటీవలే విద్యుత్ దీపం వెలగడంతో పెద్ద పండుగ వాతావరణం వచ్చేసింది. ఊర్లో విద్యుత్ కనెక్షన్ పొందిన మొదటి వ్యక్తి అంబారాం.



రాత్రిపూట తాము చదువుకోవడానికి విద్యుత్ అందుబాటులోకి రావడంతో ఇక లాంతర్లకు చెల్లు చీటీ రాయవచ్చని పిల్లలు మహదానందపడిపోయారు. తమ సెల్ ఫోన్ బ్యాటరీలను ఛార్జింగ్ కోసం పొరుగూర్లకు పోవలసిన పని తప్పిందని ఊరి యువత హర్షం వ్యక్తం చేసింది.

విశేషమేమిటంటే కొండ పైభాగంలో ఉన్న గ్రామానికి విద్యుత్ సరఫరా చేయడం అంత సులభం కాదు. ఇంజనీర్లు సవాలుగా చేసుకుని గ్రామానికి విద్యుత్ సరఫరా తీయడంలో విజయం పొందారు.

# యుద్ధరంగంలో...

1



కృష్ణదేవరాయలు అప్పుడే యుద్ధంలో గెలిచాడు. గెలుపొందిన సైన్యాధికారులు నెగడు వద్ద కూర్చుని సేద తీరుతున్నారు.

2



వారిలో ఒకడు తన నేతృత్వంలోనే యుద్ధం మలుపు తిరిగిందని అన్నాడు. ''శత్రు సేనాధిపతిని, ఏనుగును నా సైనికులే చంపే శారని'' బీరాలు పోయాడు.

3



మరొక సైనికాధికారి జతకలిపాడు: ''శత్రు శిబిరాన్ని వారి వనరులతో సహా మొత్తంగా ధ్వంసం చేసిన ఘనత నాదే సుమా.''

4



మూడో అధికారి ఇలా ప్రకటించాడు, 'నేను వాళ్ల అశ్విక దళంతో తలపడవలసి వచ్చింది. దాన్ని తుడిచిపెట్టినందుకు నాకు చాలా సంతోషంగా ఉంది.''

5



సరిగ్గా ఆ సమయంలోనే తెనాలి రామలింగడు శిబిరంలోకి అడుగుపెట్టాడు. సైన్యాధికారుల సంభాషణను అతడు విన్నాడు.

6



వారి మాటలను అడ్డుకున్న రామలింగడు వారితో అన్నాడు, 'నేను సాధించిన దాని గురించి మీకు పెద్దగా తెలియదనిపిస్తోంది.''


వాళ్లు కుతూహలంగా చూశారు. అప్పుడు రామలింగడు అన్నాడు. ''శత్రు సేనాని కాళ్లను నేనే నరికేశాను తెలుసా?''


రామలింగడి ప్రకటనతో అధికారులు ఆశ్చర్యపడ్డారు. వారిలో ఒకడు అతడిని అడిగాడు. ''కాళ్లు ఎందుకు నరికావు? అతడి తల ఎందుకు నరకలేకపోయావు?''


వాళ్లందరినీ నవ్వుల్లో ముంచెత్తుతూ రామలింగడు చెప్పాడు. ''నేను అతడిని సమీపించక ముందే అతడి తలను ఎవరో అప్పటికే నరికి వేశారు మరి!''

## హాస్య చిత్రం



# పక్షులు

మీ ఆల్బమ్‌లో ఉంచుకోవడానికి ఈ నెల కొన్ని పక్షుల చిత్రాలను ఇస్తున్నాము.



పిచ్చుక



నెమలి



నిప్పుకోడి



గూడకొంగ



చెకుముకి పిట్ట



హమ్మింగ్ బర్డ్

